# సర్వశ్రేయము

(John Ruskin's 'Unto This Last' యొక్క అను౼



అనువాదకుడు :


భోగరాజు సూర్యారావు, ఎం. ఏ.

Lecturer, St. Joseph's Training College, Guntur.



అంకితము:

మహాత్మా గాంధీజీకి

Dr. B. Pattabhi Sitaram
B.A. M.B.C.
Ex. Governor, Madhya Pr.
Hyderabad - A.P.



అంకితము :

మహాత్మా గాంధీజీకి

ఓం.

# ఉపోద్ఘాతము.

ఈ చిన్నగ్రంథము ఆంగ్లమున జాన్ రస్కిన్ (1819_1899) అను మహాకవి రచించిన 'Unto This Last' అను ఉద్గ్రంథమునకు యథాతథానువాదము. రస్కిన్ మహాకవి ఇంగ్లాండుదేశమున గొప్ప విజ్ఞానవేత్తగను, కళావేత్తగను, గొప్ప రచయితగను ఖ్యాతినొందిన మహాపురుషుడు, ఆయన చాల గ్రంథములు రచించెను. వాటిఅన్నింట నిదియే మహోత్కృష్టగ్రంథమని ఆయన పరిగణించినట్లు తన పీఠికలో చెప్పెను. ఈవ్యాసములందలి సారాంశము వాటి ప్రధానాశయము వెనుక ప్లేటో, జెనోఫానులు మంచి గ్రీకుభాషలోను, సిసిరో, హొరేసులు మంచి ల్యాటినుభాషలోను చెప్పియుండిరనియు, అట్లే తానుగూడ ప్రప్రథమముగ మంచి ఆంగ్లభాషలో వ్రాయబూనితిననిగూడ తన పీఠికలో నుడివెను. అట్టి యుత్తమగ్రంథమును నా శక్త్యనుసారముగ నాంధ్రమున కనువాదమొనర్చి పాఠకుల కందజేయుటయే నా ముఖ్యోద్దేశ్యము.

ఈ గ్రంథము మహాత్మ గాంధీజీయొక్క మహోన్నత జీవితాశయముల నిర్ణయమునకు దారితీసినదని ఆయన స్వీయచరిత్రమున జెప్పెను. అందులో "ఒక పుస్తకముయొక్క మంత్రవశీకరణము" అను శీర్షికక్రింద ఆయన ఇట్లు వ్రాసెను.

"నా మిత్రులలో మరియొకడు పోలక్ అను అయన నన్ను సాగనంపుటకు స్టేషనుకు వచ్చి, ఆ రైలుప్రయాణములో నేను చదువుకొనుటకు నాకొక పుస్తకము నిచ్చెను. నేను ఆపుస్తకమును చదువుటకు తప్పక యిష్టపడుదుననిగూడ అతడనెను. అదియే రస్కిన్ రచించిన 'Unto This Last' అను గ్రంథము. ఆపుస్తకము చదువమొదలుపెట్టిన వెనుక, దానిని విడిచి

పెట్టుట చాలమక్లేశముగ దోచెను. అది నన్నమితముగ తన వశముచేసికొనెను. జొహెన్‌బర్గునుండి డర్బన్‌కు ఇరువైనాలుగుగంటల ప్రయాణము. రైలు సాయంకాల మాస్టేషను చేరెను. ఆ రాత్రిఅంతయు నాకేమాత్రము నిద్రపట్టలేదు. ఆ పుస్తకములోని ఆశయముల ననుసరించి నా జీవితమును మార్చుకొనుటకు నిశ్చయించుకొంటిని. రస్కిన్ రచించిన ఆగొప్పగ్రంథములో నా దృఢవిశ్వాసభావములు కొన్ని ప్రతిఫలించుచున్నట్లు కనుగొంటినని నా నమ్మిక. అందువలననే అది నన్నట్లువశపరచుకొని, నాజీవితమును పూర్తిగ మార్చుకొనునట్లు చేసినది" అని ఎంతయో కొనియాడెను. అంతేగాక, ఈ గ్రంథమును ఆయన గుజరాతీభాషలోనికి అనువాదముచేసెను. అట్టి మహాత్ముని యమితశ్లాఘమును పొందిన యుత్కృష్టగ్రంథమున కనువాదమీ చిన్న పుస్తకము.

ఈ గ్రంథమున మొదట పీఠికయందు సంక్షేమసంస్థయొక్క రాజ్యాంగ విధానమును, దేశమందుగల ప్రతివ్యక్తికిని 'తుదిమానవునకును' గూడ శాంతిశ్రేయములు జేకూర్చువిధానమునుగూర్చి వివరించెను. తరువాత తొలివ్యాసమున సంఘమునందు గౌరవమూలములగూర్చి చర్చించుచు, సర్వవిధములగు కృషియు సమాన గౌరవార్హమనియు, నిస్స్వార్థభావము గౌరవార్హతకు మూలమనియు రూఢిగ చెప్పును. కార్మికుల స్థిరవేతనములపై నియమింపవలసిన యవసరమునుగూర్చి వివరించును. కార్మికులకును యజమానికిని గల సంబంధము ఆదరాభిమానములతో గూడియుండిననే పరస్పర వైషమ్యముతోగూడిన కార్మికసమస్యలు సాధింపనగుననియు నుద్ఘాటించును.

తరువాత రెండు వ్యాసములందును దేశమందు అర్థపరిసారమును గూర్చియు, ఆర్థికన్యాయమును గూర్చియు పరిశీలించును. దేశమందు అర్థపరిసారము మానవశరీరమున రక్తపరిసారమును బోలియుండుననియు, శరీరారోగ్యమునకు రక్తప్రసారమెట్లు తోడ్పడునో జాతీయాభివృద్ధికిగూడ సక్రమముగ అర్థప్రసారముగూడ అట్లే యావశ్యకమని నిరూపించును. ఆర్థిక

న్యాయము సాంఘిక సంక్షేమమునకు మూలము. ఆర్థిక అసమానతలు దేశమున నెట్లు సంభవించును, అవి ఏ స్థితిగతులందు దేశమున కనర్థదాయకములుగ నుండును, ఎప్పుడు సంక్షేమకారణములగును అను అనేక విషయములను విశదీకరించెను.

ఇందు కడపటి వ్యాసము అన్నింటిలో చాలముఖ్యమైనది. దానికై చాలశ్రమను వినియోగించి వ్రాసినట్లును, అది బహుఉత్కృష్టమైనదనియు తన పీఠికయందు జెప్పెను. అందు సాంఘిక వ్యవహారవిషయముల నామూలాగ్రముగ పరిశీలనజేసి, సంఘమున సర్వవిషయములందును న్యాయానువర్తన మెట్లు ఆవశ్యకమో, అట్టి న్యాయనిరతి కేవల మేవో యొక సామాన్యసుగుణమనియే గాక దానివలననే దేశమున సంక్షేమముచేకూరునని చెప్పను. ఇంకను అనేకములగు ఆర్థికసూక్ష్మములను విపులముగ విమర్శించి అనేక సాంఘిక సమస్యల సముచిత పరిష్కారవిధానములను సూచించును. సాధారణముగ రాజ్యాంగలక్ష్యము అత్యధికుల కత్యధిక శ్రేయఃప్రాప్తియను నదియే గాక మానవకోటియందు 'ఈ తుది మానవునికి' సైతము క్షేమము, శాంతిచేకూర్చుటయే మానవలక్ష్యమని యుద్ఘాటించును. నిత్య వ్యాపార వ్యవహారములందు న్యాయవర్తనముమూలముననే సర్వశ్రేయము తుట్టతుదకైనా చేకూరునను సంపూర్ణవిశ్వాసమును తెలుపును.

నిజమున కీ గ్రంథము అర్థశాస్త్ర విమర్శనముగ గణింపబడుచున్నను, అందలి విషయముల సామాన్యమగు నాధ్యాత్మికదృష్టితో, గంభీరభావములతో గూడియుండి సాంఘికశాస్త్రముగ నైతికశాస్త్రముగ మతగ్రంథముగ పవిత్రమగు పఠనీయ గ్రంథముగగూడ పరిగణింప ననువుగ నుండును. మానవకోటియొక్క సర్వశ్రేయఃప్రాప్తికి మార్గదర్శిగనుండి యనేక మహదాశయములను వివరించును.

రస్కిన్ మహాకవి శైలి బహుక్లిష్టముగనుండి భావగర్భితమగు సూటి పదములతో భాషాంతరీకరణమున చాల కష్టముదోపును. సరియగు సాంకేతిక

పదములు, సరసమానమగు భావవ్యాసలను సూచించు పదములు, సాంఘిక వ్యవహార సాంప్రదాయమునకు వర్తించు పదములు మొదలైనవి చాలవరకు అనువాదకార్యమున శ్రమ కల్గించెను. అందేమైన లోపములున్న క్షమించి తగు సవరణలను చదువరులు తెలియజేయగోరుదురని నమ్ముచున్నాను.

ఈ గ్రంథమును చూచి దీనికి నామకరణమొనర్చిన శ్రీ పింగళి లక్ష్మీకాంతముగార్కి నా కృతజ్ఞతను తెలుపుచున్నాను. ఈ యనువాదకార్యమున నాకు సహాకరించిన నా మిత్రులకు కృతజ్ఞతను తెల్పుచున్నాను.

ఇందలి అమూల్యమగు జీవితాశయములు చదువరుల యామోదమును బడసి సంఘమునందు సర్వసంక్షేమమునకు సర్వవిధముల తోడ్పడి దేశపురోభివృద్ధికి సహాకరించుగాక యని యాశింతును.

భోగరాజు సూర్యారావు.

—

# పీఠిక

ఈ నాలుగు వ్యాసములు పదునెనిమిది మాసముల క్రితము ప్రచురించితిని. నేను విన్నంతవఱకు, వాటిని చదివిన వారందరు తీవ్రముగ విమర్శించినట్లు తెలిసెను.

నా రచనలన్నింట నివియే బహు ఉత్కృష్టమైనవి, సత్యమైనవి, పదౌచిత్యము గలవి, చాల యుపయుక్తమైనవి అని నాసంపూర్ణవిశ్వాసము. అందును, కడపటివ్యాసము చాల శ్రమపడి వ్రాయుటచే నది నా రచనలన్నింట శ్రేష్ఠమైనది.

'అవుగాక' అందుచేత నది శ్రేష్ఠమైనదనలేమని చదువరులనవచ్చును. అందుకు నేను అంగీకరింతును ; ఇందేమా త్రిపు కృత్రిమవినయములేదు. నా నిర్వాహణములయందే యితరముతో గాకపోయినను, ఈ రచనతో మాత్రము సంతృప్తి చెందియుందును. ఈ వ్యాసములందలి యంశములను సావధానానుసారముగ విశదీకరింతును. కాని, యనురక్తులగు చదువరులు ముందుగ పరిచయముజేసికొనజూతురని వారి కొఱకీపీఠికయందు వాటిని పొందు పఱచితిని. అందువలననే, ఈ వ్యాసముల నట్లే తిరిగిప్రచురించితిని. ఒక్కచోట, తూకమునుగూర్చిన యంచనా తెల్పు నొక్కమాటమాత్రము సవరణజేయబడెను. మరియేమాటను జేర్చలేదు.

ఈ వ్యాసములందు మార్పుజేయవలసిన దేదియు నాకు కనుపించదు. అయితే కార్మికులను స్థిర వేతనములపై యేర్పాటుచేయవలసిన యవసరమును గూర్చి తొలుతనే జెప్పితిని. అది నావ్రాత లన్నింట మిక్కిలి యాందోళన కారణమైనది.

అది ఎంతసత్యమైనదైనను, చెప్పదలచినవాటిలో నంతముఖ్యమైనదిగాదు. దానినంతగసమర్థించవలసిన యగత్యమును లేదు. కానిదానిని మొదటివ్యాసముననే జెప్పినందు కించుక చింతిల్లుచున్నాను.

ఈ వ్యాసముల ముఖ్యసారాంశము, అందలియథార్థము, వాటిప్రధానలక్ష్యము, వెనుక ప్లేటో, జెనొఫానులు మంచి గ్రీకుభాషలో జెప్పిరి. సిసిరో, హోరేసులు మంచి ల్యాటినుభాషలో జెప్పిరి. అట్లే నేనుకూడ నదేవిశ్వాసముతో మొట్టమొదటిసారిగ స్పష్టముగ నాంగ్లభాషయందు తెలుపబూనితిని. అదియే, భాగ్యముయొక్క సహజమగు నిర్వచనము. అట్టి నిర్వచనము అర్థశాస్త్రమునకు ప్రధానమగు ప్రాతిపదిక.

ఈ విషయమును గూర్చిన ఆధునికరచలన్నిటిలో మిక్కిలి ప్రఖ్యాతిజెందిన వ్యాసము జె. యస్. మిల్. అనునతడు రచించెను. అది ఇట్లు ప్రారంభమగును. "ఒకదేశపు ఆర్థికస్థితినిగూర్చి వ్రాయు వారందరును, భాగ్యముయొక్క నైజమునుగూర్చి బోధించుటకుగాని, పరిశీలించుటగాని, యుద్యమింతురు" అనుచు, నింకను "భాగ్యమనగా నేమియో సాధారణముగ వ్యవహారానుగుణమగు నభిప్రాయము, ప్రతివారికిని గలదు.........దానినిగూర్చిన తత్త్వసూక్ష్మములతోగూడిన నిర్వచనమొసగుట ఈ గ్రంథముయొక్క యుద్దేశ్యముగాదు" అని కలదు.

తత్త్వసూక్ష్మములు,మనకెంతమాత్ర మవసరములేదు. కాని ఒక భౌతికవిషయమును గూర్చిన, భౌతికసూక్ష్మములు, అందలియథార్థమైన నిర్దుష్టభావము మనకు తప్పక యవసరము.

ఇట్లు, అర్థికశాస్త్రమునకు బదులు నక్షత్రశాస్త్రమును గూర్చి పరిశీలింపవలసియున్నదనుకొందము. సహజముగ ప్రకాశించు భాగ్యమునకును, ప్రతిఫలించు భాగ్యమునకును గలుగు భేదమునుగుర్తించనట్లే, స్థిరముగప్రకాశించు గ్రహములకును, చలించు నక్షత్రములకును గల భేదమునుగూడ పాటింపక, నా గ్రంథకర్త "ప్రతివానికిని నక్షత్రములనఁ నేమో సాధారణముగ వ్యవహారానుగుణమగు నభిప్రాయము గలదు. వాటినిగూర్చిన తత్త్వసూక్ష్మములతో గూడిన నిర్వచనమొసగుట ఈ గ్రంథముయొక్క యుద్దేశ్యముకాదు" అని ప్రారంభింపవచ్చును. ఈ విధముగ మొదలుపెట్టిన వ్యాసమందలి తుదినిర్ణయములు సత్యములు గావచ్చును. చాలవఱకు నావికుల కుపయోగముగ నుండవచ్చును. కాని భాగ్యమునుగూర్చి చెప్పునపుడుమాత్రము, జనసామాన్యముల యభిప్రాయములపై నాధారపడి వ్రాసిన శ్రీక ఆర్థికవేత్తకు సత్యసమ్మతముగ గాని, ఉపయోగకరముగ గాని ఉండదు.

అందుకు, ఈ వ్యాసములలో భాగ్యముయొక్క నిర్దుష్టమైన స్థిరమగు నిర్వచనమిచ్చుట ప్రథమలక్ష్యముగ నెంచితిని. అట్టి భాగ్యమును సంపాదించుట సంఘములో కొన్ని నైతిక స్థితులందే సాధ్యమనియు, అందును న్యాయనిరతి, సాధారణ వ్యవహారములందుగూడ న్యాయార్జనముయెడ నమ్మిక మొట్టమొదట యవసరమనియు జూపుట రెండవలక్ష్యము.

ఈశ్వరసృష్టియందు ఏది శ్రేష్ఠమైనది, ఏదికాదు అనునది నుడువసాహసింపను. ఏలయన, అట్టివిషయములందు మానవనిర్ణయ మకుంఠితముగాదు. అయినను 'ఈశ్వరసృష్టి

యందు ప్రత్యక్షముగ కాన్పించు నుత్కృష్టమైనవగు నన్నిటిలో న్యాయశీలుడగు మానవుడొకడ'ను నాసోక్తి యథార్థము. అయితే, ప్రస్తుత మట్టివాడుండుట చాలయరుదు, కాని నమ్మజాలనిదిగాదు, మహాద్భుతముగాదు, కేవలమసాధ్యమునుగాదు. న్యాయనిరతి ద్రవ్యార్జనాపథముల నాటంకపడి యాందోళనము గల్గించు శక్తిగాదు. అదియొక సక్రమముగ నడపించి పాలించుశక్తి దానిననుసరించిననే, ఆర్థికస్థితులయం దయోమయావస్థ ఏర్పడదు.

మన ప్రధానమంత్రాధికారిని, న్యాయనిరతియొక్క ఆదర్శ ప్రమాణమును తక్కువగ నిర్ణయించెననియు, ఎక్కువ ఉన్నతమగు ప్రమాణమును నిర్ణయింపలేదనియు కొందరు నిందించుట నేను వింటిని. అదినిజమే. న్యాయనిరతి ఒక గౌరవార్హమగు సుగుణముకాని, మానవులు అందు ఎంత ఔన్నత్యము నొందగలరు! మనము న్యాయవంతులుగ నుండినసరియా? అంతకంటె నధికముగ నేమియు మనవద్దనుండి యపేక్షింపరా?

ప్రస్తుతము, మిత్రులారా, అంతకంటె యపేక్షింపరు. కాని మనముమాత్ర మంతకన్న నధికముగ నుండుటకు గోరుచు, నామాత్రపు న్యాయనిరతి యందలి ధర్మమును గుర్తించుటలేదు. ఇంకను దేనియందు మనము విశ్వాసమును గోల్పోయితిమి? అను ప్రశ్నకాదు. మనము సామాన్య న్యాయాను వర్తనమునందు మాత్రము విశ్వాసము పూర్తిగ పోయెను. దాని సుకృతపరిభావమునందుగూడ నమ్మికనశించినది. ఆనమ్మికను అట్టినమ్మిక యే విషయములపై నాధారపడియున్నదో, ఆవిషయములను, మనము పునస్సంధానము జేసి

కొనుట మన ప్రధానకర్తవ్యము. కేవల ముద్యోగమునుండి తొలగింపబడుదుమను భీతిచేత నేగాక అన్యథాగూడ మోసము జేయవెఱచు మానవులు ప్రపంచమున నింకను గలరని విశ్వసింపవచ్చును, విశ్వసించుటయేగాదు; అనుభవమునగూడ నింకను గలరని నిశ్చయముగ గ్రహింపవలెను. అంతేకాదు; అట్టివారిసంఖ్యపైననే ఒక దేశముయొక్క స్థితిగతు లాధార పడియుండును.

ఈ రెండు విషయములను గురించియే యీవ్యాసము లుద్దేశింపబడినవి. కార్మికులను నియమించు విధానమునుగూర్చి తాత్కాలికముగ జెప్పితిని. ఏలయన, మనకుకావలసిన న్యాయపరులగు నధికారులుండిన, కార్మికుల నియామకము సులువుగసాగును. దానంతటదే, పోరు, కష్టములేక వృద్ధిబొందును. కాని అధికారులందు న్యాయనిరతి లేకున్న, కార్మికుల నియామకము మరింత దుస్సాధ్యమగును.

అట్లు ఏ స్థితి గతులందు సాధ్యమగునో, ఈ శీర్షిక యందు వివరముగ పరిశీలింపబూనితిని. ఈ మూలసూత్రముల పరిశీలనమున నేను జెప్పబోవు విషయములు చదువరులకు వెఱపును గల్గింపవచ్చును. నేను వారి నొక ప్రమాదకరమగు మార్గమున బెట్టుచున్నాననిగూడ తలంతురేమో! అందుకు, వారి నమ్మికకై నేను నిర్ణయింపనెంచిన రాజ్యాంగ విధానమును అథమపక్షమున నిచట వివరింతును.

మొదట :— దేశమందెల్ల, ప్రభుత్వపు శిక్షణక్రింద, ప్రభుత్వపు ఖర్చుపై, దేశమందలి యువకులకు శిక్షణనొసంగు పాఠశాలలు నెలకొల్పవలెను. దేశమున జన్మించిన ప్రతి

బాలుని, బాలికను, ఈ శిక్షణశాలలందు తల్లిదండ్రులకోర్కెపైనను, కొందరివిషయమున నిర్బంధముగను, పూర్ణ విద్యాభ్యాస మొందునట్లు జేయవలెను. ఈ పాఠశాలలందు దేశమునగల నుత్కృష్టమగు బోధనాశక్తితో, ముందు జెప్పబోవు విజ్ఞాన విషయములతోబాటు నీక్రింది మూడు విషయములందును వారికి శిక్షణ మొసంగవలెను.

(1) ఆరోగ్యసూత్రములు, అందుకుసంబంధించిన శిక్షణము.
(2) న్యాయము, నమ్రత నలవరచుట.
(3) జీవితాధారమగు వృత్తి.

రెండు :— ఈ శిక్షణశాలలకు సబంధించి, ప్రభుత్వ నిబంధనలకు లోబడి, జీవితావసరముల యుత్పత్తికిని, ఉపయుక్తమగు కళలయభివృద్ధికిని తోడ్పడు ఉత్పత్తికేంద్రములను, పరిశ్రమ కేంద్రములను నెలకొల్పవలెను. మఱియు, సామాన్యకృషితో సంపర్కించుకొనక, సాధారణ వాణిజ్యమున కేవిధమగు ప్రతి బంధకమునుగాని, సుంకమును విధించుట గాని లేకుండ వాటిని యథేచ్ఛగ పెంపొందనిచ్చుచు, చేతనయినచో ప్రభుత్వోద్యమమును గూడ ధిక్కరింప గల్గునట్లుండ నిచ్చుచు, ప్రభుత్వము తమ యుత్పత్తికేంద్రముల యొద్దను, కర్మాగారముల యొద్దను అధికారచిహ్నముతో నద్వితీయమగు పనిని నిర్వహింపవలెను. స్వచ్ఛమగు వస్తువులను విక్రయించవలెను. ప్రభుత్వము నిర్ణయించుధరను చెల్లింపగోరువారు, ఆ యంగళ్ళవద్ద చెల్లించిన ధరకు తగిన స్వచ్ఛమగు నాహార పదార్థములనదగు నాహారపదార్థములను, సరియగు కృషి యనదగు కృషిని పొందగల్గు నట్లుండవలెను.

మూడు:— ఈ ప్రభుత్వశిక్షణశాలలందు నిరుద్యోగులగు ఏపురుషుని, స్త్రీని, బాలుని లేక బాలికనైనను ప్రవేశపెట్టి, వారు ఏపనికి పనికి వత్తురో ఆపనిని వారియొద్ద గ్రహించుచు, వారికాసంవత్సరమున కర్హమగు వేతనము లొసంగబడవలెను. ఒకవేళ వారజ్ఞానముచే నిరుపయోగులైనచో, వారికి తగువిద్య గఱపవలెను. శరీరాస్వస్థతచే నిరుపయోగులైనవారికి చికిత్సయొసగవలెను. పనిజేయుట కిష్టపడకుండిన, వారి నధికకష్టతరమగునట్టి, హేయమగునట్టి. గనులు మొదలగు ప్రమాదకరమగు చోటులందు జాగరూకతతో, తగుశిక్షణతో, నాప్రమాదస్థితిని వీలగువరకు తగ్గించుచు, పనిని కడునిర్బంధముతో జేయించవలెను. అందుకు వారికియ్యదగు వేతనమునుండి ఆ నిర్బంధమునకగు ఖర్చు పోను మిగిలినది. వారికి, వారు పనిపాట్లయొక్క ధర్మమును గ్రహించిన వెనుక, ఉపయోగపడునట్లుంచి యివ్వవలెను.

నాలుగు :— వృద్ధులకు, అనాథులకు, సౌఖ్యమును వసతిని కల్పించ వలెను. పై విధాన మములు జరుపుటవలన మరదృష్టము, నేరమునుండి విచక్షింపబడును. అపుడీ విధముగ నాదరము బడయుట సిగ్గుచేటుగాక గౌరవముగ నుండును.

సంఘమున మధ్యతరగతికి జెందు నొకపురుషు డేవిధముగ కత్తితోగాని, కలముతోగాని ఈటెతోగాని తన దేశమునకు సేవజేయునో అట్లే ఒక కార్మికుడును, తన పారతో దేశముకొఱకు పాటుపడును. ఆరోగ్యముగ నున్నపు డాతడొనర్చు కృషి మధ్యతరగతి వాడొనర్చు కృషికన్న తక్కువయయిన, అతని వేతనముగూడ, తక్కువగ నుండవచ్చును అనారోగ్యముగ నున్నను అతని వేతన మట్లే తగ్గవచ్చును

గాని గౌరవమున మాత్రము తక్కువకాదు. అట్లే సహజముగ, తనకంటె నెక్కువ తరగతికి చెందినవాడుతాను దేశమునుండి వృద్ధాప్యబత్తెమును గ్రహించుట ధర్మము.

ఇందుకు నేను జీవన్మరణముల క్రమఫలములను గూర్చిన ఒక తుది మాట చెప్పెదను. ఏమానవుడైనను, అధికుడుగాని, అధముడుగాని, తన జీవితాంతమున, "వేలెరియస్ పబ్లికోలా" యను నాతనిగూర్చి "లైవీ" యను నాతడు చెప్పినట్లు, తానొక "ప్రజామిత్రుడు" అను ఖ్యాతిని గడించి, తుదకాతని యంత్యక్రియలను గూడ నితరులు జేయవలసినంత పేదరికమున నుండినను, ఆతని జీవిత మేమాత్రమును గౌరవహీనమైనది కాదని గ్రహింపవలెను.

ఈ విషయములను నేను దృఢముగ నమ్ముచున్నాను. వీనినే ముందు నా శక్త్యను సారముగ వివిధసందర్భములందును విశదీకరింప బూనితిని. వాటికి సంబంధించిన యితర విషయములనుగూడ పరిశీలింతును. చదువరులు నాతుది భావమునకై కలవరపడుదురేమో యని వాటినిచట క్లుప్తముగ జెప్పితిని. అయినను, మానవనైజముయొక్క సూక్ష్మములనుగూర్చి వివరించు నిట్టి శాస్త్రమునందు, వివరించిన పద్ధతులయొక్క విజయమునకుగాక, అందలి తుది సూత్రముల సత్యమునకే బాధ్యత వహించుట సాధ్యమగును. దీనినే చదువరులను జ్ఞప్తినుంచుకొమ్మని కోరుచున్నాను. మరియు, వీటిలో బహుశ్రేష్ఠమైన విషయములలోగూడ, నేది వెంటనే సాధ్యమగుననునది సంసయాస్పదము, ఏది తుదకు సాధ్యము అనునది యూహింప నశక్యము.

---

# సర్వశ్రేయము

## గౌరవమూలములు.

వివిధకాలములందు మానవజాతి యందనేకుల మనస్సుల నావరించిన భ్రాంతులన్నిట కడు చోద్యమైనది, ఏమాత్రము నమ్మజాలనిది స్వయంనిర్ణితమైన ఆధునిక అర్థశాస్త్రము. మానవసంఘమున గల సహజమగు నాదరాభిమానములతో నిమిత్తములేకుండగనే అనుగుణమగు సాంఘికవర్తన విధానమును నిర్ణయింపవచ్చునను భావముపై నాధారపడిన దీ యాధునిక అర్థశాస్త్రము.

నిజమునకు, స్వర్ణయోగము, జ్యోతిషము, ఇంద్రజాలము మొదలగు ప్రజాభీష్టసిద్ధాంతములవలె, నీ అర్థశాస్త్రమందుగూడ నొక సమంజసమగు మూలాధారభావము కలదు. “సంఘమున మానవాదరాభిమానములు మానవనైజమందల జడికలిగించు తాత్కాలికములు; కాని దురాశ, పురోభివృద్ధిపై నాస, ఇవియే స్థిరమైన మానవలక్షణములు. అస్థిరములగు తొలివిషయములను తోసిపుచ్చి, మానవుని కేవలమొక దురాశాపూరితయంత్రముగ భావించి, కార్మికకృషి, క్రయవిక్రయముల గూర్చిన ఏ సూత్రము లత్యధిక ధనార్జనసాధన

ములో పరిశీలింతము. అట్టిసూత్రములొకసారి నిర్ణయించిన పిదప, ప్రతివ్యక్తి తన యిష్టానుసారముగ నలజడి కలిగించెడి ఎంత యాదర భావము ప్రవేశపెట్టవలెనన్న నంత ప్రవేశపెట్టి, ఆ నూతన పరిస్థితులవలన కల్గు ఫలితమును తనంతటతానే నిర్ణయించుకొనును”నని అర్థశాస్త్రజ్ఞుడు చెప్పును.

ఏతే, తరువాత ప్రవేశపెట్టు తాత్కాలికములును, మొదట పరిశీలించిన ప్రేరణశక్తులును, ఒకేనైజము కల్గియున్న, నీవిధమగు వ్యవచ్ఛేదము చాల సమంజసముగను, జయప్రదముగను ఉండును. చలనమందున్న ఒకవస్తువు స్థిరమైన, అస్థిరమైన రెండు వివిధశక్తులకులోనై యున్న, దానిపథక్రమమును నిర్ణయించుటకు సూక్ష్మముగ, ముందు స్థిరమైనశక్తిని పరిశీలించి, తరువాత నందు మార్పుగలుగజేయు శక్తివలనకల్గు స్థితులను పరిశీలింతుము.

కాని ఈసాంఘికసమస్యయందట్లుగాదు. అలజడిగల్గించు విషయములు స్థిరవిషయములవంటి నైజముకల్గినవికావు. ఏలయన, వాటినిప్రవేశపెట్టగనే పరిశోధనమందున్న జీవియొక్క ముఖ్యనైజమునే మార్చివేయును. అవి గణితశాస్త్రవిధమున గాక రసాయనశాస్త్రవిధమున వర్తించి, ఆ జీవినిగూర్చిన మన పూర్వజ్ఞానమునే నిష్ప్రయోజనముగజేయు పరిస్థితుల నేర్పరచును. మనము స్వచ్ఛమైన నత్రజనిపై అనేక నిపుణమగు ప్రయోగములనుచేసితిమి. అదియొక ప్రయోగానుగుణమగు వాయుపదార్థమని దృఢనిర్ణయము చేసికొంటిమి. కాని మనము నిత్యము ఉపయోగించు నత్రజని దాహ్లమును,

మన సాధారణ సూత్రముల ప్రకారమంటెన తత్క్షణమే, మన లను, మన ప్రయోగసాధనములనుకూడ ఇంటికప్పుగుండ నెగురగొట్టును.

ఆ శాస్త్ర దత్తాంశములకు సమ్మతింతుమేని, దాని తుది నిర్ణయములనుగూర్చి నేను సందేహింపను; ఉల్లంఘింప నేరను. కాని ఆ దత్తాంశముల యెడ నాకు తూష్ణీం భావము కలదు. మానవులకు అస్థికలు లేవని ఎంచి కల్పించిన శారీర శిక్షణ శాస్త్ర దత్తాంశములవలెనే పరిగణింపనగును. ఈ దత్తాంశములనుండి, విద్యార్థులను చిన్న బిళ్ళలక్రిందజేయుట, రొట్టెలవలె అణగగొట్టుట, తీగలక్రింద సాగగొట్టుట మొదలగు విధములుగ జేయుట మిక్కిలి యనుకూలముగ నుండు నని నిరూపించవచ్చును. అట్లు జేసిన పిదప తిరిగి అస్థికలు ప్రవేశపెట్టుటకు వాటి సహజ స్వభావమే ప్రతిబంధకమగునని గూడ నిరూపించవచ్చును. ఈ విధమగు వాదముయొక్క సరళి యత్యామోదముగ నుండవచ్చును. తుది నిర్ణయ ములు యథార్థములు కావచ్చును. శాస్త్రము మాత్రము ప్రయోగలోపము గల్గియుండును. ఆధునిక యర్థశాస్త్రము గూడ సరిగ నట్టి మూలములపైననే ఆధారపడియున్నది. మానవునకు అస్థికలు లేవనిగాక, మానవుడు కేవలమొక అస్థిపంజరమే యని భావించును. ఈ ఆత్మ వినాభావముపై నస్థికాభివృద్ధి శాస్త్రమును కల్పించును. ఇట్లు అస్థికలతో సాధ్యమగు దానినంతయు నిర్వహించి, కపాలములతో, శల్య ములతో ననేక వినోదకరమగు క్షేత్రగణిత రూపములను

నిర్మించి, పిదప నాశరీరాణువుల యందాత్మ పునస్సంధానమున కెట్లనకాశముండదో రూఢిగ నిరూపించును. ఈ శాస్త్రమును సత్యము కాదనను; కాని ప్రస్తుత ప్రపంచ సరళికి మాత్రము అనువర్తనీయము కాదందును.

ఇట్లు అనువర్తనీయము కాదనుట కిటీవల జరిగిన యుద్ధ్రుతమగు కార్మికుల సమ్మెలు వింత నిదర్శనములు. ఇదే యర్థశాస్త్రము పరిష్కరించవలసిన మొట్టమొదటి ముఖ్య సమస్య—యజమానికి పనివానికిని గల సంబంధము బహు క్లిష్టమైనది; సముచితమైనది. ఒక ఉద్ధృతి ఘట్టమందు, అనేకుల జీవితములు, ప్రజాసంపద ప్రమాదస్థితియందున్నపుడు ఈ అర్థశాస్త్రజ్ఞులు నిస్సహాయులై, సంపూర్ణముగ మౌనము దాల్తురు. వివాదపడు నుభయ పక్షములకు సముచితమగు శాంతిప్రదమైన పరిష్కార విధానము నొసగలేదు. కడు మూర్ఖతతో యజమానులాసమస్య నొకవైపునుండి జూతురు; మూర్ఖతతో కార్మికులు మరియొకవైపునుండి జూతురు; వారియుభయులను ఏ రాజ్యాంగవిధానమూ సమాధానపరచలేదు.

ఐతే అట్లు సమాధానపరచుటగూడ వింతగ నుండును. ఏలయన, మానవులను సమాధానపరచుట ఏ విధమైన శాస్త్రము వలన గూడ నుద్దేశించలేదు. వివాదు లొకరి వెంబడి నొకరు ఆడంబరముగ వెడలి, యజమానుల యభీష్టములు కార్మికుల యభీష్టములకు వ్యతిరేకమని కాని, కావని కాని, నిరూపింప జూతురు. ఈ న్యాయవాదులలో నొకరును

గూడ అభీష్టములు భిన్నములైన, వ్యక్తులు, విధిగ, నవశ్యముగ, వ్యతిరేకులు కానక్కఱలేదని గ్రహింపరు.

ఒక గృహమందొక రొట్టెముక్కయున్న, తల్లి పిల్లలు క్షుద్బాధతోనున్న, వారి యుభయుల కోరిక లొకటి గావు. తల్లి దానిని తినిన, పిల్లలకుండదు; పిల్లలు తినిన, తల్లి ఆకలితో పనికి పోవలెను. ఐనను, వారిరువురిమధ్య దీర్ఘ వైషమ్య ముండుననిగాని, వారుభయు లారొట్టెముక్కకై పోట్లాడుదురనిగాని, యందు సహజముగ బలిష్ఠురాలగు తల్లి ఆరొట్టెను తీసికొని తినివేయుననిగాని యనుట కెంతమాత్రము వీలులేదు. అట్లే, మఱి ఏ యితర విషయమునందైనను, మానవుల పరస్పర సంబంధము లెట్లున్నను, వారి యభీష్టములు భిన్నములైనంతమాత్రమున వారు విధిగ పరస్పర విరోధమున, హింస, కుయుక్తుల నుపయోగించి ఒకరిపై నింకొక రెట్టి యవకాశమునైన తీసికొందురనుట తథ్యమన వచ్చునా ?

అట్లే ఐన, మానవులకు, పిల్లులయొక్క, పందుల యొక్క ప్రవర్తనముకంటె నధికమగు నైతిక లక్షణముల ప్రసక్తి లేదని భావింతుమా ? అట్లు భావించినను ఆ సమస్య యొక్క న్యాయసరళి నింకను నిర్ణయింపజాలము.

సాధారణముగ యజమాని, కార్మికులలో యుభయుల యభీష్టము లొకవిధమైనవనిగాని, కావనిగాని నిరూపింప సాధ్యముకాదు. ఎందువల్లననగా, పరిస్థితుల ననుసరించి

అవి ఎట్లయిన నుండవచ్చును. విధిగ, సవ్యముగ, పని నిర్వహించుట అందుకు న్యాయమగు విలువ లభించుట యుభయుల యభీష్టమగును. కాని లాభమును విభజించుకొనుటలో ఒకని లాభము రెండవవానికి నష్టము కావచ్చును, కాకపోవచ్చును. పనివాండ్రు జబ్బుగ కడుదైన్యముగ నుండునంతటి తక్కువకూలి నొసంగుట యజమానికి శ్రేయముగాదు. యజమానికి లాభముబొత్తుగా తక్కువై, అతని వ్యాపారాభివృద్ధికి భంగకరమగునట్టిగాని; భద్రముగ, విరివిగ, నా వ్యాపారము సాగించుటకు వీలులేనంతటి స్వల్పలాభము జేకూర్చునట్టి హెచ్చుకూలి నపేక్షించుటగాని కార్మికునికి శ్రేయముగాదు. ఒక వాణిజ్యసంఘము తమ యంత్రపు చక్రములనుగూడ మరమ్మతుచేయించుకొనలేనంతటి బీదస్థితియందుండిన, అట్టి సంఘమునుండి ఆ యంత్రముపై పనిచేయువా డధిక వేతనమును కోరరాదు.

ఇట్లే వారి యన్యోన్యశ్రేయముల నిర్ణయించు పరిస్థితులనంతవిధములుగ నుండును. ఏదోయొక తాత్కాలికావసర పరిష్కారవిధానము ననుసరించి కొన్ని ప్రవర్తన నిబంధనల ప్రతిపాదింపయత్నించుట నిష్ఫలదాయకమగును. అట్లు నిష్ఫలదాయకమగుటయే సహజము. ఏలయన, మానవప్రవర్తన మగత్యనుసారముగ గాక న్యాయానుసారముగ నిర్ణయింపవలెననియే ఈశ్వరసంకల్పము. అందువలననే, సాధారణముగ, అగత్యనుసారముగ జేయు ప్రయత్నములు శాశ్వత ఫలప్రదాయకములుగావు.

ఏ నిర్ణీతమార్గానువర్తనముయొక్క తుదిఫలితములు తనకుగాని, యితరులకుగాని యెట్లుండునని యే మానవునికి యెన్నడును, తెలియలేదు; తెలిసికొనలేడు. కాని, యేదిన్యాయమో, యేదిఅన్యాయవర్తనమో, ప్రతివానికి తెలియవచ్చును; మనలో చాలమందికి తెలియును. మరియు నేదిఅత్యుత్తమమో, అది యెట్లు సంభవించునో మనము చెప్పలేకున్నను, న్యాయముయొక్క ఫలితములు తుదకు, మనకు యితరులకుగూడ, నత్యుత్తమమైనవగుననికూడ నందరికి తెలియవచ్చును.

నేను పైన 'న్యాయానుసారముగ' నంటిని. అందు న్యాయమను పదములో నాదరముగూడ కలదు. ఆదరమనగా మానవులొకరియెడ నింకొకరు చూపవలసిన ఆదరాభిమానములని భావము. యజమాని కార్మికుల పరస్పరసంబంధములన్నియును, వారియుభయుల యభీష్టములును, తుదకు వీటిపైననే ఆధారపడియుండును.

ఈ యజమాని కార్మికుల పరస్పరసంబంధముల నిరూపించుట కతియనుకూలముగ నుండునట్టి మిక్కిలి స్వల్పమైన యుదాహరణముగ నింటినౌకర్ల విషయమును గమనింతము.

ఒక యింటియజమాని తననౌకర్లకు కొంత వేతనమును చెల్లించును. అందుకతడు వారియొద్దనుండి ఎంతపనిగ్రహించ గల్గునో యంతపనిని తీసికొనును. అతడు వారినెప్పుడు నూరక నుండనీయడు. వారు భరించగల్గినంతటి పేదరికపుతిండిని, వసతిని ఇచ్చును. ఇక, తనపనులను గొనుటలో, నేపరిమితిని

త్రాను మీరిన తననౌకర్లకు పనినుండి విరమించుకొనుటతప్ప గత్యంతరముండదో, నాపరిమితివరకు తనపనులను పెంచును. ఇట్లు చేయుటలో నతడు సామాన్యధర్మమునకు విరుద్ధముగ ప్రవర్తించుటలేదు. అతడు తననౌకర్లకు పూర్తి కాలమునకు, పూర్తి సేవకు వేతనమిచ్చుట కొప్పుకొనును. శ్రమయొక్క కాఠిన్యతవిషయమున నిరుగుపొరుగుల యజమానుల ననుకరించును. అనగా నాతడింటినౌకర్ల కాపరిసరములందు అమలులోనున్న వేతనమిచ్చుచుండును. నౌకరున కంతకంటె మంచి నౌకరిదొరికిన నతడు పోవచ్చును. అప్పుడు యజమాని వారి శ్రమ కాచోట అమలునందున్న నిజమైన విలువయెంతయో దెల్పి తా నివ్వదలచుకొన్న దెంతయో జెప్పవచ్చును.

ఇది ఈ విషయమునుగూర్చి అర్థశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఈ పద్ధతివలన నౌకరువద్దనుండి ఎంతయెక్కువ పని లభించనగునో నంతయధికమగు పనిలభించును. తద్వారా సంఘమున కత్యధికోపకారము చేకూరును. తద్వారా నౌకరునకును శ్రేయముకల్గును, అని ఈసమస్యపట్ల వారి యభిప్రాయము.

కాని యథార్థముగ నది యట్లుకాదు. అట్లు పని చేయు నౌకరొక యావిరిశక్తిచేతనో, లేక అయస్కాంతశక్తి వలననో లేక ఆకర్షణశక్తిచేతనో లేక లెక్కింపవీలగు నే యితర శక్తిచేతనో నడచు నౌకయంత్రమైన, నది అట్లే యగును. కాని, అట్లుగాక, నావ్యక్తియొక్క అద్భుత యంత్రమును నడపించునది యగణితమైన, అగోచరమైన నాత్మశక్తి. అది అర్థశాస్త్రజ్ఞుల కగమ్యమై వారి సమీక్షలయందు

ప్రవేశించి, వారినిర్దేశముల విఫలీకృతి మొనర్చును. అట్టివింత
యంత్రమునుండి అత్యధికపుపనిని, జీతమునకుగాని, నిర్బం
ధమునగాని, మరి యేయితర శక్తిసాధనమునగాని గ్రహింప
సాధ్యముకాదు. ఆతని యాత్మబల సాదరాభిమానములచే
సంపాందిననే అత్యధికపుపనిని పొంద సాధ్యమగును.

ఒకవేళ యజమాని అధిక శక్తిసామర్థ్యములుగల్గి, తన
శక్తివంచనమునను, నైపుణ్యముచేతను, ఒకవిధమగు నిర్బంధ
స్థితులనుకల్పించి అధికమగు పనినిగొనుటసంభవింపవచ్చును;
తరుచు సంభవించును. ఒకప్పుడు యజమాని యెంత
మంచివాడైనను, బద్ధకస్తుడు, అసమర్థుడునైన నౌకరును
సరిగ వినియోగించుకొనజాలడు. నౌకరాతనిని తృణీకరించును.
చాల తక్కువ పని నొసగుట సంభవించును. అదియు చాల
పాడగుపనికూడ కావచ్చును. ఇట్లును తరుచు సంభవించును.

ఇట్టి విషయములలో సర్వదా అనువర్తనమగు సూత్ర
మేమన, యజమాని నౌకరుల యిరువురివద్దను కొంతశక్తిజ్ఞాన
ములు కలవని భావించిన, వారి యుభయులకుగూడ నత్యధిక
మగు ఫలితము చేకూరుట, వారిరువురమధ్య పరస్పర వైష
మ్యమునగాక, పరస్పరాను రాగమువలననే సాధ్యమగును.
మరియు, యజమాని నౌకరువద్దనుండి రాబట్టగల్గినంత పనిని
రాబట్ట యత్నించుటకు బదులు, తాను నిర్ణయించిన యవ
సరమగు పనిని తన కుపయుక్తముగ నుండునట్లు జేయుచు,
తన యభీష్టములన్నియును న్యాయమగు సముచిత మార్గ
ముల ననుకరింపజేసిన, నట్లాదరింపబడిన నౌకరొనర్చు · నిజ

మగు పని, యాతడు చేకూర్చు మంచి, యత్యధికముగ నుండును.

'చేకూర్చుమంచి' యనుటకు కారణమేమన, ఒక నౌకరొనర్చు పని యెల్లప్పుడును, విధిగ, తాను యజమాని కియ్యగలట్టి కనుశ్రేష్ఠమైన పని కాకపోవచ్చును. కాని అతడనేక విధములగు మంచిని చేకూర్చవచ్చును. చేసెడు కృషి యందేమి, యజమాని ఆస్తిపాస్తుల కాపాడుటకు జూపు ప్రమత్తతయందేమి, అనుకోనని యితర సమయములందు సహాయపడుటకు జూపు సంసిద్ధతయందేమి, అనేక విధముల మంచి చేకూర్చవచ్చును.

ఇది సామాన్యముగ సత్యదూరము కాదు. అయితే సుహృద్భావము తరుచు దుర్వినియోగపాత్ర మగును. ఆదరమునకు ప్రతిఫలము కృతఘ్నత యగును. యజమాని సౌమ్యత జూపిన నౌకరు కృతఘ్నత జూపును; విరసము జూపిన వైషమ్యమును జూపును. విశాల హృదయుడగు యజమానియెడ ద్రోహము నెంచు నౌకరు అన్యాయవర్తనుడగు యజమానియెడ హాని తలపెట్టును.

ఏ విషయమునగాని, ఏ మానవుని యెడగాని, స్వార్థ రాహిత్య స్వభావ మత్యుత్తమ ప్రతిఫల మొసగును. ఇచట ఆదరాభిమానము లుద్బోధనశక్తి గలవని భావించుచున్నాను. అంతేకాని అవి ఏవో ఉత్తమ గుణములనిగాని, సముచితములనిగాని, ఒక విధమగు సలక్షణములనిగాని మాత్రమే చెప్పుటలేదు. వాటిని అర్థశాస్త్రజ్ఞుల ప్రతిగణనమును శూన్య

ముగ జేయుఅనిర్ణీయమగు శక్తిగ పరిగణింతును. ఈ నూతన నాంశమును గూర్చి వారు తలపెట్టినను, దానితో వ్యవహరించుటకు వారికి శక్తిలేదు. అర్థశాస్త్రమందలి ప్రతి యితర సాధనమును, పరిస్థితిని యుపేక్షించిననే, ఈ సాదరాభిమానములు నిజమైన యుద్బోధన శక్తిగ వర్తించును.

నౌకరుయొక్క కృతజ్ఞతవలన లాభము పొందగోరి, నీవాతనిని దయతో జూచిన, నీవెట్టి కృతజ్ఞతను పొందవు; అదే నీఅర్హత. నీ దయకును విలువ యుండదు. కాని యే విధమగు అర్థికావకాశ మపేక్షింపకయే ఆతనిని దయతో జూచిన, సకలార్థికావకాశములు చేకూరును, ఇంతేకాదు; మరేయితర విషయములందును గూడ, ఎవడు తన స్వార్థమును కాపాడుకొన జూచునో ఆతడు దానిని కోల్పోవును; ఎవరు స్వార్థమును త్యజింతురో వారికే అది లభించును.

యజమాని, నౌకరుల సంబంధమును సూచించు తరువాత యుదాహరణ మొక సైన్యాధికారికిని అతనివద్ద గల సైనికులకును గల సంబంధము; మిక్కిలి విశదముగ నుండును; కడు స్వల్పమగు విషయము.

ఒక సైన్యాధికారి తన కేమాత్రపు ప్రయాసము లేకుండ నుండగోరి, కేవలము క్రమశిక్షణా నిబంధనలను మాత్ర మవలంబించి, తన సైన్యము నతి సామర్థ్యముగ తరిబీతు చేయ నిచ్ఛగించునందము. కాని ఆతడీవిధముగ స్వార్థ మనుసరించుటజేసి, తాను ఏ నిబంధనలవలనగాని,

నిబంధనల ననుసరించిన పరిపాలనముచేగాని, తన సైనికులను సంపూర్ణ సమర్థులుగ జేయజాలడు.

అయితే ముందు జెప్పినట్లు, ఆతడు బుద్ధి కుశలతను దృఢనిశ్చయమును గల్గియున్న, ఒక అసమర్థుడగు అధికారి అవగ్రితతో జూపు దయవలన సాధించు దానికంటె అధికోచిత ఫలితమును పొందవచ్చును. కాని ఉభయులును సమానమగు బుద్ధికుశలత దృఢనిశ్చయములు గల్గియున్న, అందెవరు తన సైనికులందు ప్రతివానితో స్వయంసంబంధము కలిగి, వారి యోగక్షేమముల సదా అరయుచు, వారి ప్రాణముల జాల విలువగ జూచునో, ఆతడే, మరి యేయితర సాధనములవలనను పొందనేరనట్టి సైనికుల దృఢవిశ్వాసానురాగములపొంది, తన సైనికుల నత్యధిక సామర్థ్యులుగ జేయగల్గును. ఈ విధానము సైనికు లధికసంఖ్యాకులైన కొలది మరింత నిశ్చయముగ ననువర్తించును. సైనికులకు తమ అధికారిపై అనురాగము లేకున్నను, ఒకొ్కక్కతరి సైన్యము జయప్రదముగ పురోగమింపవచ్చును. కాని, సైన్యాధికారిపై ప్రేమలేని సైనికులతోనే యుద్ధమును గెలువ సాధ్యముకాదు.

ఈ స్వల్పయుదాహరణలనుండి అంతకంటె నధిక క్లిష్టమగునది యుత్పత్తిదారునికి కార్మికులకు గల సంబంధమునుగూర్చి పరిశీలింతము. అది మరింత నిష్కర్షమగు కఠిన నైతిక విషయములతో గూడియుండి మొదట మనకు వింతయగు కష్టములు దోచునట్లుజేయును.

ఒక సైన్యాధికారియెడ వాని సైనికులకుగల ఉద్రేక పూరితమగు ప్రేమను సులభముగ నూహింపవచ్చును. కాని ఒక కర్మాగారమున నూలుదీయుపనివాండ్రు వారి యజమానిపై ఆవేశముతోగూడి ప్రేమను జూపుట సులభముగ నూహింపలేము. కొందరు వ్యక్తులొక దోపిడిజేయుటకై ఒక కూటముక్రిందగూడిన (అనగా పూర్వపు బందిపోటుదొంగలట్లు) వారిలో ప్రతివాడును సంపూర్ణాభిమానముతో తన ప్రాణమును తననాయకుని ప్రాణమునకై అర్పింప సంసిద్ధముగ నుండును. కాని న్యాయమైన యుత్పత్తిసముపార్జనలకై గూడువా రట్టి ఆవేశభావములతో ప్రవర్తింపరు. అందు ఏఒక్కడును తన యజమానిప్రాణమునకు తనప్రాణ మర్పింప సమ్మతింపడు.

ఇట్లగుపడు సంకుచితావస్థ, ఒక్క నైతికవిషయములందేగాక, అందుకు సంబంధించిన యితరవిషయములవలన పరిపాలనావిధానమునగూడ గోచరించును. ఏలయన, ఒక నౌకరుగాని ఒకసైనికుడుగాని ఒక నిర్ణీతకాలమునకు నిర్ణీతవేతనముపై నియమింపబడును. కాని కార్మికుడుమాత్రము ఆతనిపనియొక్క అవసరమునుబట్టి సదా మారుచుండు కూలిపై నియమింపబడును. దానితోబాటు వ్యాపారసరళినిబట్టి అతడేక్షణమందైన పనినుండి తొలగింపబడు ప్రమాదముగూడ కలదు. ఈస్థితిగతులయందు ఆదరాభిమానములు పనిజేయవు సరిగదా, కేవల మనాదరమే ఉద్భూతముగ ప్రకోపించును. కనుక నీసమస్యయందు మనము విచారించవలసినవి రెండువిషయములు గలవు.

ఒకటి :—— పనియొక్క అవసరమునుబట్టి గాకుండగ, ఎప్పటికిని మారకుండగ, ఎంతవరకు కార్మికుని వేతనములను స్థిరముగ నిర్ణయింపనగును.

రెండు:—— వ్యాపారసరళి యెట్లున్నను, కార్మికులను స్థిరవేతనములపై నియమించి స్థిరముగనుంచుట యెంతవరకు సాధ్యము. వారిసంఖ్యల సదా నెక్కువ, తక్కువజేయకుండ ఒక పూర్వకాలపు కుటుంబమందలి నౌకర్లవలెనో, లేక ఒకపూజ్యమగు సైనికదళమందలి సైనికులవలెనో, వారు పనిజేయు సంస్థపై వారికి స్థిరమగు అభిమాన ముండునట్లు వారిని యేర్పాటుచేయుట ఎంతవరకు సాధ్యమగును.

మొదటిప్రశ్న, నేనుచెప్పినట్లు, పని అవసరముతో నిమిత్తములేకుండ కార్మికులవేతనముల నిర్ణయించుట ఎంతవరకు సాధ్యము? సామాన్యపు అర్థశాస్త్రజ్ఞుడట్లు స్థిరమగు కూలి నిర్ణయించుట సాధ్యముకాదనును. మానవుడొనర్చిన పొరపాట్లచారిత్రమున నెల్ల నిది కడువింతైన పొరపాటు. ఏలయన, భూమిమీద నన్ని ముఖ్యమైనట్టి, ముఖ్యముగానట్టి చాల కార్మికవిషయములందుగూడ నీవిధముగ స్థిర వేతనములు నిర్ణయింపలేదా?

మన ప్రధానమంత్రిపదవిని వేలమున అమ్మజూపము. అనుకూలముగ, ప్రముఖ మతాధికారిపదవిని, ఏమతవేత్త తక్కువ వేతనమున కంగీకరించిన ఆతని కివ్వజూడము. మన

యర్థశాస్త్ర విజ్ఞానముతో, సైనిక బిరుదులమ్ముదుము, గాని బాహాటముగ సైన్యాధికార పదవులను అమ్మము. జబ్బుగా నుండిన తక్కువసొమ్ముడుగు వైద్యునికొరకు వెదుకము; వ్యాజ్యములందు స్వల్పవ్యయముల తగ్గింపజూడము; వర్షములోనుండి, ఏబండివాడు తక్కువబాడిగకు వచ్చునాయని యోచింప మొదలిడము.

నిజముగ నిట్టి విషయములందును మనమూహింపగల నిట్టి తదితర విషయములందునుగూడ, నిర్వహింపవలసిన పని యందలి కష్టమునుగూర్చియు, ఆపని నిర్వహించుటకు గల యభ్యర్థులసంఖ్యను గూర్చియు, యోచింపవలసి యుండును. ఒక మంచి వైద్యుడగుటకు పట్టు శ్రమను కావలసినంతమంది విద్యార్థులు సామాన్యముగ వైద్యునికొసగుదానిలో సగము వేతనమున కాసించియే పడ సంసిద్ధముగనున్నారని తలంతు మేని, ప్రజాభిప్రాయము మిగతా సగము మనవసరమని అతిశీఘ్రముగ యెంచును. దీని తుదిభావము ఏమన, కృషి యొక్కవిలువ ఆకృషికిగల అవుసరమునుబట్టి నిర్ణయింప బడును. కాని నిత్యవ్యావహారికమున నత్యుత్తమమగు పనికి గూడ నన్నివిధములగు పనులవలెనే ఒకే స్థిరమైన పరిమాణ ములో చెల్లింతురు; అట్లే చెల్లింపవలెను.

"ఏమి! మంచిపనివానికి, చెడ్డపనివానికిగూడ నొకే రీతిగ చెల్లించుటా?" అని, బహుశః చదువరు లాశ్చర్య పడవచ్చు.

(3)

నిరంతరము పనియుండునప్పటికంటె అధికముగ నుండవలెను. పని సంపాదించుకొనుటకు పడు పాట్లు చాలా కష్టముగ నుండ వచ్చును. కాని సర్వదా అనువర్తించు సామాన్యసూత్రమేమన వారికి వారమునందు ఆరుదినములందునుగూడ పనియుండునను ధైర్యముతో నున్నప్పటికంటె, వారమునకు సగటున మూడు దినములు మాత్రమే పని కలదనునప్పుడు వారికి దినకూలి హెచ్చుగ నుండవలెను. ఒకడు దినమునకొక రూపాయకు తక్కువయుండిన జీవించలేడనుకొందము. అప్పుడతనికి వారమునకు కావలసిన యేడు రూపాయిలు వారములో మూడు దినములు తీవ్రముగ పనిచేసియో లేక ఆరోజులు తాపిగ పనిచేసియో సంపాదింపవలెనుగదా!

ఆధునిక వాణిజ్యసరళి అటు కార్మికుని కూలిని, ఇటు వాణిజ్యమునుగూడ ఒకవిధమగు జూదముక్రింద జేయును. కార్మికుని వేతన మాతని అప్పటప్పటి శ్రమపై నాధారపడునట్లు జేయును. యజమాని లాభ మతడు నిపుణతతో నుపయోగించుకొను నవకాశముపై నాధారపడునట్లు జేయును.

వాణిజ్యసరళియం దిట్టిది యెంతవరకగత్యమో యిచట పరిశీలింపను, కాని ఒక్కయథార్థమునుమాత్ర మిచట చెప్పి తృప్తి చెందుదును. వాణిజ్యసరళియం దెట్టి మహోపద్రవము ననుగూడ అట్టివిధాన మెంతమాత్ర మవసరము లేదు. అది కేవలము యజమానుల జూదకాంక్షలవలనను, కార్మికుల అజ్ఞానమువలన ఉద్రేకకాంక్షచేతను సంభవించుచున్నది. యజమానులు లాభముచేకూరు ఏ అవకాశముకూడ తప్పి

పోవుట సహించలేరు. అత్యంతావేదనతో భాగ్యసంపాదనమున, ప్రతి చిన్ని సావకాశముయెడ నతితీవ్ర ధనార్జనాసక్తితో, దుస్సహదుష్కాంక్షతో, ఏ వినాశకారణస్థితినైన నెదుర్కొన సాగుదురు.

ఇక కార్మికులు వారమం దారుదినములు మితియగు పనిని, వివేకయుతమగు విశ్రాంతినికోరుటకు బదులు, మూడు దినములు ఉద్ధృతమైన కష్టమును, మూడు దినములు తాగుడును కోరుదురు.

ఒకయజమాని నిజముగ కార్మికులకు శ్రేయము చేకూర్చుటకు, తనయందును వారియందును గల దురభ్యాసముల పోగొట్టుటవలనతప్ప మరి యేసాధనము లేదు. తన వ్యాపారనిర్వహణమున నెట్టి ప్రమాదయుత లాభమును గడించు దురాశలకు లోనుగాక, తన వ్యాపారము కడు భద్రముగ సాగించుకొను విధానమున నుండవలెను. దానితోబాటు, తన పనివాండ్రు సక్రమముగ పనిజేయునట్లును, సక్రమముగ జీవించునట్లును, మంచి అలవాట్లను ప్రమోదింపవలెను. అట్లు జేయుటకు, వారికెక్కువ కూలి నొసగి కొంతకాలము పని లేకుండ యుంచుటకంటె, తక్కువకూలితో స్థిరముగ నుండుటకు ప్రోత్సహించనగును. ఇది సాధ్యముకానిచో, నాయకా హెచ్చురోజు కూలిపై నుద్ధృతముగ పనిజేయు పద్ధతినుండి నిరుత్సహించుచు, క్రమమైనపనిజేయుచు తక్కువకూలినైన గ్రహించునట్లు చేయవలెను.

ఈవిధమగు ముఖ్యసంస్కారములు జేయుటకు పూను ఉద్యమకారకులకు చాల కష్టనష్టములు కల్గుట నిశ్చయము. కాని కడు సానుకూలముగను, నష్టములేకుండగను చేయగల్గినదిమాత్రమే మనమెల్లప్పుడును చేయనవసరమైనది, చేయవలసినది కానేరదు.

హింసతోకూడు కార్యములపై యుండు సైనికులకును, శాంతితోకూడు ఉత్పత్తికై నియమింపబడు కార్మికులకును గల భేదమునుగూర్చి యింతకుముందే జెప్పియుంటిని. మొదటివారు స్వార్థత్యాగమునకు సామర్థ్యముగలవారివలె కాన్పింతురు, రెండవవారు అట్లుకాదు. వాణిజ్యవృత్తిని సాధారణముగ సైనికవృత్తికంటె న్యూనతతో పరిగణించుట కిదియే యథార్థమగు కారణము. వేదాంతరీత్యా అది సకారణముగ గన్పడకపోవచ్చును. చాలమంది రచయితలట్లు పరిగణించుట అన్యాయమనిగూడ నిరూపింపజూచిరి. ఒక వివేకవంతుడొకడు ప్రశాంతముగ సదా క్రియవిక్రియములవ్యాపారము జేయువానిని, ఒక అశాంతియుతుడును, తరుచు అవివేకవంతుడును, సదా చంపుటయే వ్యాపారముగ గల వానికంటె తక్కువగౌరవముతో జూచుట న్యాయమా? ఎట్లైనను, వేదాంతపరులేమన్నను, వ్యాపారస్థునికంటె సైనికునిగౌరవాధిక్యతకు మానవకోటి సమ్మతించెను.

అదేన్యాయము. ఏలయన సైనికుని వ్యాపారము నిజమున కవశ్యముగ వధించుటగాదు; వధింపబడుట. ప్రపంచమీయర్థము బాగుగ గ్రహింపకపోయినను, యిందుకే సైని

కుని గౌరవించును. ఒక హంతకుని వృత్తికూడ చంపుటయే. కాని ప్రపంచ మీ హంతకులను వర్తకులనుకంటె నెక్కువ గౌరవింపదు. సైనికుని గౌరవించుటకు ముఖ్యకారణమేమన, ఆతని ప్రాణములు దేశసేవకై వినియోగించును.

అతడు కడు నిర్లక్ష్యముగ నుండవచ్చు; విలాసమును గాని సంఘటనమునుగాని అపేక్షించవచ్చు; సకలవిధము లగు దురభిలాషలను నీచవాంఛలను గల్గి ఆతడావృత్తి నవలంబింపవచ్చు. పై కగుపడునట్లే, ఆతని అనుదిన ప్రవర్తనముగూడ తదనుసారముగ నుండవచ్చు; కాని ఆతనినిగూర్చిన మన అభిప్రాయమొక తుది యథార్థముపై నాధారపడియున్నది. మనము దానిని దృఢముగ విశ్వసింతుము. అదేమనిన, అతని నొక కోటరక్షణకై నియమించిన, ఆతని వెనుక సకలైహికానందములుండి, ముందు మృత్యువు, తన విధికృతములుమాత్రమేయుండిన, ఆతడు సదా ముందునకే జూచునుగాని వెనుకకు జూడడు. ఇట్లు రెండువిధము లగు స్థితులును ఆతని ముందు ఏక్షణమునందైన నుండవచ్చునని గూడ నాతడెరుగును. అటిస్థితులతో నాతనికి పూర్వానుభవముగూడ కలిగి యుండవచ్చును; నిరంతరానుభవములు గూడను; నిజమునకు ఆతడనుక్షణము మృత్యువు నెదుర్కొనును.

ఇట్లే న్యాయవాదియెడల, వైద్యునియెడల గూడ తుదకు వారి స్వార్థత్యాగమూలముననే సమాన గౌరవమును చూపుదుము. ఒక న్యాయవాది యెంత విజ్ఞానవంతుడైనను, ఎంత సూక్ష్మబుద్ధి కల్గియున్నను, అతనియెడ మనకుగల

ముఖ్యగౌరవ మాతని నొక న్యాయస్థానమునందుంచిన, పర్యవసానమెట్లున్నను, నతడు న్యాయమునే యనుకరించునన్న మన పూర్ణ విశ్వాసముపై నాధారపడియుండును. అతడు లంచములు పుచ్చుకొని, తన సూక్ష్మబుద్ధితో నన్యాయమును సమర్థించునని మన మెంచినచో, నాతడెంత తెలివి గల్గియున్నను మన గౌరవమును పొందనేరడు. అతని జీవితమున నన్ని ముఖ్యవిషయములందును, న్యాయమే తొలిపక్షముగను, తన స్వార్థము రెండవ పక్షముగ గణించునన్న దృఢవిశ్వాసము మనకుండిననే ఆతని గౌరవింతుము. ఇతరమేమియుగూడ నాతనికట్టి గౌరవము చేకూర్చనేరదు.

వైద్యునియెడ మనము గౌరవముజూపుటకు కారణము మరింత స్పష్టముగనుండును. అతని శాస్త్రమేమైననుగానిమ్ము; అతడు తనరోగులను ప్రయోగసాధనములుగ పరిగణించునని గ్రహింతుమా, అతనియెడల మనకత్యంత భయముకల్గును. ఇంకను,తన రోగులమరణమును గోరెడువారియొద్దనుండి లంచములు పుచ్చుకొని, మందిచ్చునెపమువ విషము నిచ్చునని గ్రహింతుమా, వానియెడ మనకు మరింత భీతికల్గును.

తుదకు మతబోధకునియెడల నీ గౌరవసాధనము మరింత స్పష్టముగనుండును. వైద్యుడెంత మంచిస్వభావము కల్గియున్నను యతనివద్ద శాస్త్రజ్ఞానలోపమున్న క్షమింపము. అట్లే న్యాయవాదునియెడగూడ యుక్తిసామర్థ్యములలోపమును క్షమింపము. కాని ఒకమతబోధకునియొద్ద తెలివి కొంత

లోపమైనను. ఆతనిగూర్చి మనము భావించెడు అతని స్వార్థ రాహిత్యమునకును సేవాతత్పరతకే ఆతనిని గౌరవింతుము.

ఇక, ఒక పెద్దవాణిజ్యసంస్థను జయప్రదముగ నడపుటకు సౌజన్యత, దూరదృష్టి, నిర్ధారణశక్తి మొదలగు ననేక బుద్ధివిశేషము లవుసరమనుట నిర్వివాదాంశము. అయితే ఒక గొప్ప న్యాయవాదితోగాని, సైన్యాధికారితోగాని, మతాధికారితోగాని సరిపోల్చదగునంతటి బుద్ధివిశేషము కాకపోయినను, ఒక సామాన్య నౌకాధికారితోగాని సైనికునికిగాని, ఒక గ్రామమతబోధకునికిగాని గల బుద్ధివిశేషముతో సరియగు బుద్ధిప్రాబల్య ముండవలెను. కాని పైనజెప్పిన యుదారవృత్తులకు జెందినవారినెల్ల, నీవాణిజ్యసంస్థయొక్క అధిపతిని జూచుకంటె, నెక్కువగౌరవముతో చూచుచున్నారనుటకు, వారివారి బుద్ధిప్రాబల్యముల ననుసరించియేగాక, యితరమూలకారణము లుండవలెను.

ఈవిధమగు పక్షపాతమునకు ముఖ్యకారణము, వర్తకు డెల్లప్పుడు స్వలాభాపేక్షతో వర్తించునని మనము భావించుటయే కదా! అతడు నిర్వహించుపని సంఘమున కత్యవుసరము కావచ్చును; కాని అందతని యుద్దేశ్యముమాత్రము పూర్తిగ స్వార్థమేయని మనము గ్రహింతుము.

వర్తక వ్యాపారమున, వర్తకుని ప్రధానలక్ష్యము తన స్వయమున కెంత సంపాదించగల్గిన నంత గడించుటయనియు, తనపొరుగువానికి, యనగా, కొనుగోలుదారుని కెంతస్వల్పము

విడువసాధ్యమో యంతవదలుట యనియు ప్రజలనమ్మకము. అత డవశ్యమనుకరించవలసిన విధానమిదియేయని, ఆతనిపై రాజ్యాంగనిబంధనలను అమలుపరతురు. అన్నిసమయము లందు నాత డట్లు చేయవలెనని ప్రోత్సహించుచు, తమరు గూడ తిరిగి అట్టిప్రవర్తనమే యవలంబింతురు. కొనుగోలు దారునిపని చవుకగ జేయుట, అమ్మకపుదారునిపని మోసము జేయుట, ప్రపంచధర్మమని అతిధారాళముగ జెప్పుచు, ప్రజలు తాము చెప్పినప్రకారమే నడచుకొన్నందులకు వర్త కుని అనావశ్యముగ దూషించుచు నాతని నొక నిమ్నజాతి మానవమాత్రునిగ తృణీకరింతురు.

ఇట్లు జేయుట కూడదని ప్రజలు క్రమేణ గ్రహింప వలెను. స్వార్థపరాయణత్వమును దూషించుట మానరాదు; కాని కేవలము స్వార్థాభిలాషతోనే కూడియుండనట్టి వర్తక విధానమును కనిపెట్టవలెను. అంతేగాక స్వార్థాభిలాషతోనే గూడిన నేవిధమగు వర్తక వ్యాపారమెన్నడును లేదనియు, ఇకముందుగూడ నుండజాలదనియుగూడ కనిపెట్టవలసి యున్నది. మనము సామాన్యముగ వర్తక వ్యాపారమని పిలుచునది వర్తకవ్యాపారముకాదు. అది కేవలము మోసము జేయుటయే యనిగూడ తెలిసికొనవలెను. ఒక నిజమైన వర్తకునికిని, ఆధునిక యర్థశాస్త్ర సూత్రముల ప్రకారము వ్యాపారముజేయు వర్తకునికిని, ఒక మహాన్యాయవర్తునుడగు వేదాంతపుణ్యపురుషునకును, ఒక హేయమగు బందిపోటు దొంగకునుగలట్టి భేదము కలదు.

అప్పుడు మనుష్యులతో సంప్రతించునట్టి, మనుష్యులను చంపునట్టి, యితర వృత్తులకంటె వాణిజ్యము తగు మనుష్యు లవలంబించవలసిన వృత్తిగ ననుదినము చూతురు. మరియు నిజమగు బోధనమునందును నిజమగు సంగ్రామము నందు నెట్లో, అదేవిధముగ నిజమగు వర్తక వ్యాపారము నందుగూడ అప్పుడప్పుడు స్వయంకృతముగ నష్టమునకు సమ్మతింపవలసియుండునని గ్రహింతురు. వర్తకుడు తన నిజ కర్తృత్వ నిర్వహణమందు తాను ధననష్టమునకే గాక ప్రాణనష్టమునకుగూడ నుద్యుక్తుడై యుండును. మతవేత్తల ప్రాణత్యాగమువలెనే వాణిజ్యమందుగూడ ప్రాణత్యాగ మొనర్చువా రుండవచ్చుననియు, సంగ్రామమున జూపెడు వీరత్వమునంటి వీరత్వము వాణిజ్యమునగూడ యుండవచ్చుననియు గ్రహింతురు.

'ఉండవచ్చును' గాదు 'ఉండవలెను' అనగా నింతవరకు నుండలేదనిగూడ భావము. ఏలయన, వాణిజ్యము ప్రస్తుత మన్నివృత్తులలో ముఖ్యమైనదైనను దాని నట్లుగణింపక, వీరులగు యువకులనందరి నితరవృత్తులకు మరలించుట జరిగెను. అందుచే నింతవరకును మహానుభావుల నేకులు కడు నుత్సాహముతో మానవకోటి కనేక సువార్తలబోధించుచు తమజీవితములు చాలించుకొనిరి. కాని, ఒక వాణిజ్యవ్యాపారమున నొక వందపౌనుల నష్టమునకు సిద్ధపడినవారు లేరు.

నిజమునకు ఇతరులయెడ వర్తకుని నిజకర్తవ్య మాతని కెవరును నెన్నడును స్పష్టముగ తెలిపియుండలేదు. చదువరు లీ విషయమును స్పష్టముగ గ్రహింపవలెను.

ప్రతి నాగరిక దేశమందును జీవితావసరములకు సంబంధించిన బుద్ధినైపుణ్యములతో గూడినట్టి అయిదువృత్తులు కలవు. అందు మూడువృత్తులు చాల ముఖ్యముగ నుండును.

సైనికుడు దేశమును రక్షించుట
బోధకుడు దేశమునకు బోధించుట
వైద్యుడు దేశము నారోగ్యముగ నుంచుట
న్యాయవేత్త దేశమందు న్యాయమును ప్రమోదించుట
వర్తకుడు దేశపోషణమును జూచుట.

వీరందరి కర్తవ్య మవుసరసమయమున దేశమునకై ప్రాణములర్పించుటయై యున్నది.

'అవుసర సమయమున', అనగా—

సైనికుడు యుద్ధమున తన నియమితస్థానమును వీడుటకు బదులు, వైద్యుడు ఒక పెద్దఅంటుజాడ్య సమయమున తన నిజస్థానమును వీడుటకుబదులు,

బోధకు డసత్యమును బోధించుటకు బదులు,

న్యాయవేత్త యన్యాయమును చూచుచు నూరకుండుటకు బదులు ;

వర్తకుడు — ఇతడు ప్రాణము లర్పించవలసిన అవుసర సమయమేమి? ఇదే వర్తకునికి, మనకుగూడ ప్రధానమగు ప్రశ్న. ఏలయన, ఎవనికైన నెప్పుడు ప్రాణము లర్పించవలెనో తెలియదో, వారికి ఎట్లు జీవించవలెనో గూడ తెలియదు.

వర్తకుడనగా నిచట వ్యాపారముచేయువానికి, నుత్పత్తిదారునికిగూడ వర్తించును. అట్టి వర్తకుని ప్రధాన కర్తవ్యము దేశపోషణార్థము కృషిసల్పుట. బోధకునికర్తవ్యము తనబత్తెమును గ్రహించుటయే కాదు; అట్లేవర్తకుని వ్యాపారము లాభమును సంపాదించుటయే కానేరదు. నిజమైన బోధకుని జీవితలక్ష్య మాతని బత్తెముకాదు; అది యాతని జీవిత సాధనము. అట్లే యొక నిజమగు వైద్యుడు గ్రహించు విత్త మాతని జీవితలక్ష్యము కాదు. అట్లే యొక నిజమగు వర్తకునికిగూడ నాతని లాభముమాత్రమే ఆతని జీవిత లక్ష్యముకాదు.

ఈ ముగ్గురును నిజమగు మానవమాత్రులైన, వారి బత్తెములతో నిమిత్తము లేకుండగనే వారాచరించవలసిన ప్రత్యేక కర్తవ్యము గలదు; ఆ కర్తవ్య మెట్టితరినైన నాచరింపవలయును.పరిహారమునకుబదులుఏకష్టనష్టములుప్రాప్తించినను నిర్వహింపవలసినదే ఆకర్తవ్యము.బోధకుడు బోధించుట, వైద్యుడు చికిత్సజేయుట, వర్తకుడు పోషణ సాధనము లిచ్చుట, యివి వారివారి కర్తవ్యములు. వర్తకుడు తాను వ్యాపారముజేయు సరకుల యధార్థ లక్షణము లామూల

ముగ గ్రహింపవలెను. వాటి యుత్పత్తి సాధనములును, సేకరణ సాధన విధానములనుగూడ గ్రహించవలెను. తన సర్వశక్తిని, వివేకము నుపయోగించి సరకుల స్వచ్ఛమగు స్థితిలో నుత్పత్తిచేయుట, స్వచ్ఛమగు స్థితిలో సేకరించుట, స్వచ్ఛమగు స్థితిలో వాటినవుసరమగుచోట్లకు గొనిపోయి యెంత చవుకగ నమ్మగల్గిన నంత చవుకగ నమ్ముచుండుట జేయవలెను.

ఏ సరకులనైన నుత్పత్తిచేయుటయందును, సేకరించుటయందు ఆతడనేక సహకారుల నియోగించవలసి యుండును. కనుక వర్తకుడుగూడ తన వ్యాపారమునందును ఒక సైన్యాధికారి, మతాధికారివలెనే క్రమేణ, కొంచెము తక్కువగ, యనేకులపై యాజమాన్యము, పరిపాలనాధికారము బడయును. కనుక వారి జీవిత విధానమునుగూర్చిన బాధ్యత చాలవరకు తనపై బడును. అప్పుడతడు కడు చవుకగ విక్రయించనగు స్వచ్ఛమగు సరకు నెట్లు యుత్పత్తి చేయనగునని యోచింపవలసియుండును. ఆ సరకుయొక్క యుత్పత్తి, రవాణా మొదలగు వాటియందు నియమింపబడు వారికి వారి యుద్యోగము లుపయుక్తముగ నుండునట్లు జూచుటగూడ యాతని విధికృతమగును.

ఈరెండు కార్యముల సక్రమ నిర్వహణమునకు నత్యాధిక బుద్ధిబలము, శాంతము, దయ, నిపుణత అవుసరమగును. కనుక వర్తకుడు తన యావచ్ఛక్తిని వినియోగింపవలసి యుండును. మరియు, నాకార్యములు న్యాయానుసారముగ

నిర్వర్తించుటలో నొక సైనికునివలెగాని, వైద్యునివలె గాని, తానుగూడ నవసరమైనపుడు తన ప్రాణములను సహిత మర్పించవలసియుండును.

ఈ విధముగ, సమకూర్చుటలో నాతడు రెండు విషయములు గమనింపవలసియున్నది. మొదటిది వాణిజ్యమున సకలావకాశములకు మూలమైనది, తమ యొడంబడికలయెడ దృఢవిశ్వాసముతో ప్రవర్తించుట గనుక, వర్తకు డాతని యొడంబడికలపట్ల వంచనము జేయకుండ ప్రవర్తించవలెను. రెండవది, తాను సమకూర్చు సరకు స్వచ్ఛముగ పరిశుద్ధముగ నుండునట్లు జూడవలెను. ఈరెండు విషయములందును తనకేవిధమైన క్లేశము, దుస్థితి, దారిద్ర్యము, శ్రమ కల్గినను వాటిని నిర్భయముగ నెదుర్కొనునుగాని, తన యొడంబడికల నుల్లంఘించుటగాని, తాను సేకరించు సరకులు చెడిపోయినవై యుండుటకుగాని, కల్తీ యగుటకుగాని. అన్యాయముగు విపరీతధరల కమ్ముటకుగాని సమ్మతింపడు. మరియు, తన వ్యాపారమున నియోగింపబడినవారియెడలను, తనపాలనా విధానమునను, వర్తకునికి లేక యుత్పత్తిదారునికి యొక విధమగు పితృబాధ్యత యధికారముకూడ గలవు.

చాలవారకొక వాణిజ్య సంస్థలో ప్రవేశించు యువకుడు తన స్వగృహ సంపర్కములేక యుండును. తన యజమాని తనయెడ తండ్రివలె నుండవలెను. లేనిచో నతడు నిత్యకృత్యములందు సదా పితృసహాయము లేకుండయుండును. అన్ని విషయములందును, యజమాని యధికారము,

వ్యాపార వాతావరణము, ఆ యువకుడు పనిజేయునపుడు కలసిమెలసి యుండవలసిన యితర కార్మికుల నడవడి అన్నియు నా యువకునిపై తన స్వగృహముకంటె నెక్కువ ప్రమోద కారణములై మంచికిగాని చెడ్డకుగాని కారణభూతము లగును. అట్టిచో యజమాని తన కార్మికులయెడ న్యాయానువర్తను డగుటకుగాను, తాను వారితో వ్యవహరించునపుడెల్ల తన స్వపుత్రు డేవో పరిస్థితుల వలన నట్టి సేవజేయవలసిన స్థితియందుండిన వానియెడ నాత డెట్లు ప్రవర్తించునో నట్టి ప్రవర్తనముతో నడచుకొనుచుం టినా లేదాయని సదా తనను తాను ప్రశ్నించుకొనుచుండ వలెను.

ఒక నౌకాధికారి కుమారుని తన యధికారముక్రింద నొక సామాన్యనావికునిగ యుచితమనియెంచియో, లేక విధి వశముననో నియమించుట తటస్థించిన, ఆతడు వానికుమారుని. నెట్లుజూచునో అట్లే తనదగ్గర పనిజేయు ప్రతికార్మికునియెడ ప్రవర్తింపవలెను. అదేవిధముగ నొక యుత్పత్తిసంస్థయొక్క యజమానిగూడ, తాను మంచిదని యెంచియో లేక విధివశముననో, తనపుత్రునిగూడ సామాన్యకార్మికునిగ నియమించిన, నాత డాతనియెడ నెట్లు ప్రవర్తించునో అట్లే తనవద్ద నున్న ప్రతికార్మికునియెడ పితృవాత్సల్యముతో ప్రవర్తింప వలెను. అర్థశాస్త్రమున ఈవిషయమునుగూర్చి వివరింపవల సినది ఈయొక్కటే చాలడుపయోగమగు వ్యావహారిక సత్య సూత్రము.

మరియు, నౌకయోడ మునుగుచుండునపుడు ఆయోడ యొక్క ప్రధానాధికారి యెట్లు యందరివెనుక తుదివరకుండి నోడను విడువవలెనో, క్షామసమయమున నాతడెట్లు తుదిభక్షణ మునుగూడ తన నావికులతో సరిగ పంచుకొనునో, అట్లే ప్రతియుత్పత్తిధారుడును వ్యాపారము దుర్దశయందుగాని క్లిష్టదశయందుగాని ఉండిన తన కార్మికులతో బాటు తాను గూడ నాక్లేశమును పొందవలెను. అంతేకాదు. వారికంటె అధికముగ యనుభవించుచు, ఏ కాటక సమయముననో, నౌకా ప్రమాద సమయముననో, యుద్ధసమయముననో, తండ్రి తనపుత్రునికొరకై త్యాగముచేయ బూనునట్లు, యుత్పత్తిదారుడుగూడ తన కార్మికులయెడ ప్రవర్తింపవలెను.

ఇదియంతయు చాల వింతగ ధ్వనించును. అందలి నిజముగు వింత. అది కడు యోగ్యమైనదగుటయే యని గ్రహింపవలయును. ఏలయన, అదియే సంపూర్ణ సత్యము; కొంతవరకేకాదు, అనుటయందేకాదు; సర్వదా యాంచరణమునగూడ నదియే సంపూర్ణసత్యము; రాజకీయ విషయములకు సంబంధించిన ఇతర సిద్ధాంతములన్నియుగూడ నసత్యములగు మూలములపై నాధారపడియుండి, యసందర్భములై, ఆచరణమందసాధ్యములై, జాతీయపురోగాభివృద్ధి కనుగుణ్యముగ నుండవు. మన జాతీయజీవితమున సామాన్యజనులందరకు బోధించెడు ఆర్థికసూత్రములను కొద్దిమంది దృఢమనస్కులు,

విశ్వాసఘాతకులు ఎంత నిరసించినను, ఎంత ఖండించినను, వాటినే అవలంబించుట, వాటినే అనుకరించుట మన జాతీయ వినాశనమునకు దారితీయును.

ఏ విధముగ, నేరూపమున నట్టి వినాశనమునకు దారి తీయునో, నిజమైన రాజకీయమెట్లు వ్యవహరింపనగునో, వాటినిగూర్చి రాబోవు వ్యాసమున చర్చింతును.

——

# ద్రవ్యనాశులు

పూర్వ ప్రకరణమందలి వివరములకు సామాన్యయర్థ శాస్త్రజ్ఞు డొసగు సమాధాన మీ క్రింది కొద్దిమాటలలో చెప్పవచ్చును.

“సాంఘికాదరాభిమానముల పెంపొందించుటవలన కొన్ని సాధారణావకాశములను పొందవచ్చును. కాని యర్థ శాస్త్రజ్ఞులట్టి సామాన్యనైజముగల యవకాశముల గూర్చి యోచింతుమనరు, యోచింపలేదు. మాశాస్త్రము కేవలము ధనార్జనగూర్చిన శాస్త్రము, అదియొక భావనకాదు, భ్రాంతి కాదు. అనుభవమువలన వ్యావహారికయుక్తముగ నుండునని నిరూపింపబడినది. అందలి సూత్రము లనుసరించినవారు విధిగ ధనవంతులగుదురు; వాటిని తిరస్కరించిన పేద లగుదురు. ఐరోపా దేశమందలి ప్రతి శ్రీమంతుడును. మా శాస్త్రనియ మముల పాటించుటవలననే ఐశ్వర్యవంతుడాయెను. అవి నిత్య మనుసరించుటవలనే యనుదినమును ధనాభివృద్ధి నొందు చున్నాడు. ఇట్టి నిర్వహింపబడిన సత్యమునకు వ్యతిరేకముగ తార్కికతంత్రముల ప్రయోగించుట నిష్ఫలము. వాణిజ్యము చేయు ప్రతివానికిని ధనమెట్లుగూర్చనగునో యెట్లు గోల్పో దురో యనుభవసిద్ధమే”అని యందురు.

క్షమించుడు, వాణిజ్యముచేయువారికి ఒకప్పుడు తా మెట్లు ధనమార్జించిరో, ఒకప్పుడు తామెట్లు నష్టపోయిరో తప్పక తెలియును, అది వారికి చిరానుభవముగల చీట్లయాట

వలెనుండి అందు చీట్లపేర్పుతో పరిచయము కలిగియుందురు. వారి లాభనష్టముల సకారణముగ వివరింపగల్గుదురు, కాని ఆ జూదగృహములోని ధనముయొక్క మూలాగార మెక్కడ నున్నదో మాత్రము వారికి తెలియదు. ఆచీట్లతోడనే మరి యే యితరాటలాడనచ్చునోకూడ వారికి తెలియదు. కాంతి వంతమగు నాగదులకు దూరముగ నంధకారమగు వీథులందు ఎవరికిని కానరాకయే, తమ ఆటలవలననే అవశ్యముగ నే యితరలాభనష్టములు కల్గుచున్నవోగూడ వారికి తెలియదు. వాణిజ్యపు ఆర్థికసూత్రముల కొన్నిమాత్రమే వారు నేర్చు కొనిరి; కాని యర్థశాస్త్రసూత్రముల నేమియు వారెరుగరు.

మొట్టమొదట గమనింపవలసిన వింతైన విషయము యందరికి తెలిసినది యేమన, మన వణిజులకు 'ధనవంతము' యనుమాట కర్థమరుదుగా తెలియును. అథవా తెలిసినా, వారి విచారణలలో నదియొక సాపేక్ష పదమనియు, నందు దాని వ్యతిరేకమును 'పేదతనము' యనుదానిని, 'ఉత్తరము' అను పదముయొక్క వ్యతిరేకమును 'దక్షిణము' యను దానినెంత నిశ్చయముగ ధ్వనించునో, యదేవిధముగ ధ్వనించునన్న యథార్థమును గమనింపరు. మానవులు చాల వరకు ధనము నిరంకుశమని చెప్పుదురు, వ్రాయుదురు. ఏవియో కొన్ని శాస్త్రీయసూక్తుల ననుసరించుటచే ప్రతి వారును ధనికులు కావచ్చుననికూడ యందురు. కాని ధనముకూడ విద్యుచ్ఛక్తివలెనే కలిమిలేములవలనను, తన హెచ్చుతగ్గులవలనను వర్తించునట్టి యొక శక్తి యనవల

యును. ఎట్లన, నీవద్దగల రూపాయియొక్క శక్తి నీ పొరుగు వానివద్ద నది లేకపోవుటపై నాధారపడియుండును. అది వాని కక్కరలేనిచో, నీకు దాని యుపయోగ ముండదు. దాని శక్తి సరిగా పొరుగువానికి గల దాని యవుసరముపైనను, దానికై గలవాని యపేక్షపైనను ఆధారపడియుండును. కనుక సాధారణముగ వ్యాపారసరళిలో, నీవు ధనవంతుడ వగుట యనగా, నీపొరుగువానిని తప్పక సమానమగు పేదరిక మందుంచుట యని యర్థము.

ఇందు ముఖ్యముగ, వివరముగ గ్రహించవలసిన విషయము, రాజ్యాంగపు ఆర్థిక విధానమునకును, వాణిజ్యపు ఆర్థిక విధానమునకును గల భేదము, రాజ్యాంగపు ఆర్థిక విధానము లేక యర్థశాస్త్రమని వ్యవహరించునది యొక రాజ్యముయొక్కగాని యందలి పౌరులయొక్కగాని ఆర్థిక స్థితినిగూర్చి తెల్పును. అది కేవల ముచితకాలమున నుపయోగకరమైనట్టియో, ఆనందకరమైనట్టియో వస్తువుల యొక్క సముయోచిత యుత్పత్తి, నిల్వ, అంపకములగూర్చి చెప్పు శాస్త్రము. సకాలమున తన పంట పండించు కర్షకుడు, మంచి చెక్కల సమగూర్చి సరిగ నోడను నిర్మించు నౌకా నిర్మాత, జవగల సున్నముతో మంచి యిటుకల సరిగ నమర్చు మేస్త్రి, గృహమందు జాగరూకతతో నింటిసామాగ్రిని చూచుకొనుచు వంటింట నేవిధమగు వ్యర్థమునకు తావీయక వర్తించు గృహిణి, తన గాత్రము నుచితరీతిని భద్రపరచుకొనుచు క్రమశిక్షణ నభ్యసించు గాయకుడు—

వీరందరు నిరంతరము తమ దేశక్షేమమునకు, దేశ సౌభాగ్యమునకు తోడ్పడుచు తుది భావమున నిజముగ నా రాజ్యాంగపు ఆర్థికస్థితి ప్రమోదకు లనబడుదురు.

కాని వాణిజ్యపు విధానము మాత్రము వేతనముల గూర్చి తెలుపును. కొందరు వ్యక్తుల చేతులలో చట్టముల మూలముననో లేక నీతిమూలముననో యితరుల కృషిపై హక్కునుగాని యధికారమునుగాని చేకూర్చుటనుగూర్చి తెల్పును. అట్టి ప్రతిహక్కును, యధికారమును ప్రతిపక్షమున ఎంత దారిద్ర్యమునుగాని ఋణమునుగాని సూచించునో, స్వపక్షమున సరిగా నంత ధనవంతమును యధికారమును సూచించును.

కనుక నది రాజ్య సౌభాగ్యాభివృద్ధికిగాని, దేశ క్షేమమునకుగాని తప్పక తోడ్పడుననుటకు వీలులేదు. కాని యీ వాణిజ్యసంపదగు కార్మికులపై నధికారమును సర్వసామాన్యముగా కోరినవెంటనే స్థిరాస్థిగ మార్చవచ్చును. స్థిరాస్థిని మాత్రము ఎల్లప్పుడును కోరినతత్క్షణము కార్మికులపై నధికారముగ మార్చ వీలుకాదు. కనుకనే సాధారణముగ నాగరిక దేశములందు, ధనమనగా వాణిజ్యసంపదయనే యెంచుదురు. ఇక వారి యాస్థిని నిర్ణయించుటలో వారి పశువులు, భూములు విలువగూర్చి యవి వారి కిన్ని రూపాయిలు తేగలవని లెక్కింతురుగాని, వారివద్దగల రూపాయీల విలువను వాటితో నెన్ని పశువులను, ఎన్ని భూములను కొనగలరని మాత్రము లెక్కింపరు.

ఈవిధమగు మనః ప్రవృత్తికి మరియొక కారణము కలదు. ఏమన, కేవలము స్థిరాస్థిమాత్రము ప్రోగుజేయుట వలన చాల తక్కువ యుపయోగముండును; దానితో బాటు వణిజ సంపదగు కార్మికులపై యధికారముగూడ యుండిన గాని స్థిరాస్థి యుపయోగశూన్య మగును. ఉదాహరణముగ నొకనికి ఫలవంతమగు భూమిగల పెద్ద సంస్థానము గలదను కొందము. అందు భూమిలో గొప్ప బంగారుగనులున్నవను కొందము. లెక్కలేని పశువులు నిరంతర మతని పచ్చికభూము లందు మేయుచు, నీళ్ళు, తోటలు, యుపయుక్తమగు వస్తువు లతో నిండిన కొఠారులు మొదలైన వెన్నియో గలవను కొందము. కాని యతడు నౌకర్లను మాత్రము తెచ్చుకొనలే డనుకొందము. అతనికి నౌకర్లు దొరుకుటకుగా నతని పొరుగున నెవరో పేదరికములో నుండవలెనుగదా! అతని బంగారమునకో ధాన్యమునకో యపేక్షింపవలెను. అట్టి స్థితిలో నెవరును లేరనుకొందము; అందుచే నతనికి నౌకర్లు లేరనుకొందము. అప్పుడు తన భోజనమును తానే తయారు జేసికొని, తన బట్టల దానే యుదుకుకొని, తన భూమిని తానే దున్నుకొని, తనపశువులను తానే కాచికొనవలసియుండును. అతని బంగారమతనికి నిరుపయోగమగును. అతని కొఠారులు క్రుళ్ళి నాశనముకావలెను గదా! తా నొక్కడు మాత్రమే వాటిని వినియోగింపలేడు. అతడే యితర మానవునికన్న నెక్కువ దినగలడు? ఎక్కువదుస్తులు ధరించగలడు? అతడు ప్రతి సామాన్యకార్మికునివలె శ్రమపడి తనజీవితముయొక్క

ముఖ్యావసరములగూడ సమకూర్చుకొనవలసి యుండును. తుదకు తన భవనములన్నియు శిధిలపడును; తన భూము లన్నింటిని తాను సాగుజేయలేకపోవుటచే నవి పాడువడి మరు క్షేత్రము లగును; తుతకాతడొక సామాన్య పేదగృహస్థుని వలె చిన్నగుడిసె, చిన్నతోటతోను, సంతుష్టిపడుచు, పాడు వడి యెడారులవలెనున్న భూములమధ్య, విచ్చలవిడిగ నే పశువులో యచట విహరించుచుండ, మహాభవనముల శిధిల ములమధ్య, తనవని జెప్పుకొనుటకుగూడ బిడియపడుచు, నివ సింపవలసి యుండునుకదా!

ఎంత దురాశాపరుడగువాడును యిట్టి ధనసంపత్తిని, ఈ విధముగ స్వీకరించ నెంతమాత్ర మిచ్చగింపడు. కనుక ధనమను పేరుతో నిజముగ నపేక్షించునది ఇతరమానవులపై నధికా రము. మన సదుపాయమునకై నొకనొకరునుగాని, వర్తకుని గాని, కళావేత్తనుగాని వినియోగించుకొనగల యధికారమును గాని సామర్థ్యమునుగాని యపేక్షింతుమని అర్థము. లేదా ఆ ధన వంతుని యిష్టానుసారముగ మంచికో, చెడ్డకో, సులభమో ప్రమాదకరమో అయిన నే వివిధకార్యములకును, పెక్కుమం దిని వినియోగింపగల నధికార మనవచ్చును. అట్లు నియోగింప బడువారి పేదరికము హెచ్చైనకొలది ధనాధికారము వారిపై హెచ్చుగనుండును. తక్కువైనకొలది యా యధికారము తక్కువగును. మరియు, వస్తువులుకొద్దియైన వాటికి సమాన ముగ ధర చెల్లింపగల సమానముగు ధనికులెంత యధికమైన నంతకు నా ధనాధికారముగూడ తగ్గును. ఒక గాయకుడు

పేదస్థితిలోనున్న, నాతనిని బహూకరింపగల్గిన వా డొక్కడే యున్న నాతడు తక్కువ వేతనమున కే పాడవలయును. కాని వాని నట్లు బహూకరించగల్గిన వార నేకులున్న, వారిలో నాతని కెవ రెక్కువ చెల్లింతురో వారికే పాడి వినుపించును. కనుక ధనముయొక్క యధికార మెంత హెచ్చైనను నది యెన్నటికిని స్వేచ్ఛమైనది కాదు., నిర్వివాదమైనదికాదు. ఒక ధనవంతుని యొక్క ధనాధికారము మొదట నా విద్వాంసుని పేదరికము పైనను, పిదప నాసంగీతమునకై యపేక్షించు సమానమును ధన వంతుల సంఖ్యపైనను ఆధారపడియుండును. కనుక, ధనవంతు లగుట యనగా, సామాన్యభావమున, చివర కవశ్యముగ మనకై ధనము పోగుచేసికొనుటయే కాదు. దానితోబాటు మన పొరుగువారు ధనహీనులగునట్లు పన్నాగము జేయుటగూడ యగును. సరిగ జెప్పవలెనన్న ధనవంతుల మగుట యనగా మన కనుగుణ్యముగ నత్యధిక యార్థికాసమానత్వమును కల్పించుట యనవలెను.

ఇక నట్టి యసమానత్వమును కల్పించుట మొత్తము మీద దేశమున కనుగుణమో కాదో నిర్ధారణ జేయలేము. అట్టి యసమానము లవశ్యముగ దేశశ్రేయమున కనుగుణ మని యెంచు విపరీతమగు వికృతభావముకలదు. దీనికిమూల మర్థశాస్త్రముయొక్క వింతభావములందు కలదు. ఏలయన నీ విషయమున నవశ్యముగ వర్తించు సూత్రమేమనగా, నట్టి యసమానత్వమువలని, శ్రేయము, మొదట నాయసమానత్వమును కల్పించు విధానములపైనను, తరువాత దాని నే

కార్యములకై వినియోగింతుమో నాకార్యములపై ననాధారపడియుండును. అన్యాయముగ నెలకొల్పిన ఆర్థిక అసమానత్వములు దేశమున కనర్థకరములు. అట్టి అసమానత్వములుగల దేశమున నవి నెలకొల్పబడుచుండునపుడే నా దేశమునకు తప్పక హాని కలుగజేయుచుండును. వాటి నన్యాయముగ వినియోగించిన నవి యున్నంతకాలము దేశమునకు మరింత హాని కలుగజేయును. కాని న్యాయానుసారముగ నెలకొల్పబడిన నార్థిక యసమానత్వములు, వాటిని నెలకొల్పునపుడును దేశమునకు శ్రేయోదాయకముగ నుండును. వాటి నుత్తమ రీతిని వినియోగించిన మరింత దేశశ్రేయమునకు తోడ్పడును.

అనగా, చక్కని ప్రభుత్వముననున్న శక్తిమంతులగు ప్రజలయందు, ప్రతివ్యక్తియొక్క పూర్ణసామర్థ్యములను, వివిధావసరములకు సంపూర్ణముగ వినియోగించునపుడు అసమానములగు ఫలితములు చేకూరును; కాని యవి సమ్మోదకరముగనుండును. ప్రతి తరగతికిని, ప్రతిసేవకును*, తగిన

* "చెడుపనివారు నిరుద్యోగులగుదురు" అను నావాక్యమును గూర్చి నన్నేకసారులు అడిగిరి. "అయితే, అట్టి నిరుద్యోగులగు చెడుపనివాండ్రతో నీవేమి చేయవలయును?" మంచిది; ఈ ప్రశ్న యింతకుపూర్వమే తోచియుండవలసినది. నీయింటిలో పనికై ఒక మనిషి కావలెను. నీవు ఆమెకు సంవత్సరమున కిరువదిపౌనుల జీత మిచ్చెదవు. ఇద్దరు బాలికలా పనికై నీవద్దకు వత్తురు. అందు ఒకతె పరిశుభ్రముగ బట్టధరించుకొని యుండును. రెండవది అసహ్యముగ నుండును. మొదటిఆమెకు మంచి శిఫారసులుగూడ గలవు; రెండవఆమెకు అట్టివి లేవు. ఈ పరిస్థితులలో నసహ్యముగ గన్పడు నామె పదిహేను లేక పండ్రెండుపౌనుల జీతముననే సమ్మతింతునన్నను, నీవామెను

ప్రతిఫలముగాని ప్రత్యధికారముగాని చేకూరును. అట్లుగాక, శక్తిహీనులగు ప్రజలయందుగాని, దుష్ప్రభుత్వాధీనమయిన

సహజముగ నంగీకరింపవు. ఆమె సమ్మతించినను, మంచి శిఫారసులుగల ఆమెకుబదులుగ నామెను నియమింపవు. మరియు, వారిరువురలో పోటీ కల్పించి, ఒకరికంటె మరియొకరు తక్కువకు పని చేయునట్లుజేసి, ఒకరిని సంవత్సరమునకు పండ్రెండుపౌనులకును, మరియొకరిని సంవత్సరమునకు ఎనిమిది పౌనులకును, మొత్తమిరువదిపౌనులకు నిద్దరని నియమింపగూడ యత్నింపవు. వెంటనే, ఆపనికి తగినట్టిది, మంచిశిఫార్సులు గలట్టిది ఆమెను నియమించి, రెండవఆమెను పొమ్మందువు.

ఇప్పుడు, అట్లు నిరాకరింపబడిన ఆమెమాట ఏమి? అని నన్నడిగిన ప్రశ్నగూర్చి ఏమాత్రప్రశస్త్యము తీసికొనవు. నీనౌకరు విషయమై ఎట్లుచేసితివో అట్లే అంతటను కార్మికులపట్లగూడ నెరవేర్చుమనియే నా అభిప్రాయము. అపుడు నిశ్చయముగ, ఆప్రశ్న చాలముఖ్యమైనదగును. "సోమరి, దొంగ, అగు నీచెడ్డపనివానితో నీవేమిచేయుదువు?" అని అడుగుదువు.

ఈ పరిశ్నగూర్చి యోచింతము; కాని ఒక జాతీయ వ్యాపార పరిశ్రమల సంపూర్ణ విధానముయొక్క పరిపాలనమునుగూర్చి, ఏదో పది పుటలలో విపులముగ వివరింప సాధ్యముగాదని మాత్రము జ్ఞప్తి యుంచుకొనుము. అయితే, ఇపుడు ఒక విషయము మాత్రము యోచించవలెను. సోమరులతోను, దొంగలతోను వ్యవహరించుట చాల కష్టతరమని అందుము గదా! అందుకై అట్టివారిని ఎంత తక్కువమందిని తయారుచేసిన నంత మంచిది కాదా? దొంగల జీవిత చరిత్రలను పరిశీలించిన, నుత్పత్తి కాబడు అన్ని వస్తువులవలెనే, వారుగూడ నుత్పత్తి కాబడినవారే అని గ్రహింపవలయును. మన ప్రస్తుత అర్థశాస్త్రము అట్టివారెక్కువగ నుత్పత్తి కాబడుటకు మిక్కిలి ప్రోత్సగించుటచేతనే, అట్టి అర్థశాస్త్రము సత్యదూరమైనదని తెలిసికొనవలెను. దేశదిమ్మరులతో, దొంగలతో, చమత్కారముగ, చాతుర్యముతో వ్యవహరించువిధానమునకై పాటుబడుటకంటె న్యాయవర్తనులు పెంపొందించు విధానమునకై మనము కృషిచేయుట సర్వవిధముల శ్రేయము. మన పాఠశాలల సంస్కరించుకొనిన మన కారాగారముల సంస్కరించుకొనవలసిన యవుసరముండదు.

రాజ్యమునగాని, వివిధములగు క్షీణదశలును, ద్రోహము యొక్క దిగ్విజయములును ప్రబలును; తదనుసారముగ దాస్య విజయములతోఁగూడిన నొక యక్రమవిధానమేర్ప డును. ఏతాదృశమగు నధికారమువలన కల్గు నింపగు నసమా నత్వములకు బదులు దార్జన్య దౌర్భాగ్యములచే కల్గిన నన్యాయమగు నాధిక్యతలు, దైన్యములు ప్రబలును.

ఇట్లొక రాజ్యమందలి ధనప్రసారము సహజమగు శరీర మందలి రక్తప్రసారమును పోలియుండును. ఒకసారి యానంద పరవశత్వముననో లేక నారోగ్యకరమగు వ్యాయామముననో రక్తస్రావము తీవ్రముగావచ్చును; మరియొకసారి సిగ్గునగాని జ్వరతీవ్రతనుగాని తీవ్రముగా వచ్చును. ఒకటి సంపూర్ణా రోగ్యజీవితములతోఁగూడిన రక్తప్రసారము; మరియొకటి శరీరమును కుళ్ళ జేయుటకగు ప్రసారము.

ఈ పోలిక కడు చిన్నవిషయములకును వర్తించును. శరీరమందొకచోట రక్తము ప్రసరింపక నాగి కూడియుండుట యేవిధముగ శరీరారోగ్యక్షీణతను సూచించునో యట్లే ధన ప్రసారముయొక్క యభావముగూడ తుట్టతుదకు రాజ్యాంగ సంపత్తిసాధనము (సన్నగిలుట)ను సూచించును.

అది ఏవిధమున సంభవించునో, ఒకటి రెండు కడు స్వల్పవిషయములందు ధనాభివృద్ధి యెట్లు చేకూరునో పరిశీ లించిన బోధపడగలదు.

ఇద్దరు నావికులు కారణాంతములచే నొక నిర్మానుష్య మగు సముద్రతీరమును జేరి రనుకొందము. అచట వారిద్దరు

ననేక సంవత్సరములు తమ స్వయంకృషిచే జీవింపవలసియుండె ననుకొందము.

వారిరువురు శరీరారోగ్యమును కాపాడుకొనుచు, నిద్దరుకలిసి సఖ్యముగ సక్రమముగ కృషిసల్పిన వారొక నివాసయోగ్యమగు గృహమును కట్టుకొనవచ్చును. కాల క్రమమున కొంత సేద్యభూమినిగూడ బడయవచ్చును. భావి కాలమం దుపయోగపడుట కనేక విధములగు సామగ్రిల నిల్వజేసికొనవచ్చును. ఇవన్నియును నిజమగు ధనము లేక ఆస్తియగును. వారిద్దరు సమానముగ కష్టపడి పనిజేసిరను కొనిన, నందు వారిద్దరకు సమాన హక్కుభుక్తము లుండును. ఇక వారి యర్థశాస్త్ర మెంతవరకు వర్తించుననగా, వారిరు వురకుగల వాటినన్నిటిని జాగ్రత్తగ భద్రపరచుకొనుట, న్యాయముగ విభజించుకొనుటమాత్రమే యగును.

కొంతకాలమునకు, బహుశ, ఎట్లో, వారిసమష్టిసేద్య ముయొక్క ఫలితములపట్ల వారిరువురలో నొకరి కసంతృప్తి కలుగవచ్చును. అందుచే వారిరువురు కలసి సాగుచేయు భూమిని వారు సరియగు భాగములక్రింద విభజించుకొన సమ్మతింపవచ్చును. అప్పటినుండి యెవరి భూమిని వారే సాగుజేసికొని జీవించుటకు నిర్ణయించుకొనవచ్చును. ఈ ఏర్పాటుచేసికొనిన కొంతకాలమునకు వారిలో నొకరు జబ్బుపడిరనుకొందము. అందుచే నతడు తనభూమిలో నే యూడుపుసమయముననో లేక కోత సమయముననో మంచి తరుణమప్పుడు పని జేయలేక పోవును. అప్పుడతడు సహజ

ముగ రెండవవానిని తనభూమి నూడ్చుటకుగాని పంటను కోయుటకుగాని యడుగును.

అప్పుడతని యనుచరుడు కడు న్యాయముగ నిట్లన వచ్చును. "నేను నీకొరకే యధికశ్రమ పడుదును. కాని నీవు నాకొరకింత శ్రమను వేరొక తరుణమున పడుదువని వాగ్దాన మీయవలెను. నేను నీపొలముమీద నెన్నిగంటలు పని చేయుదునో, యన్నిగంటలసేపు నాకవుసరమగునపుడు నీవు నాపొలములో పనిచేయుదునని వ్రాతపూర్వకముగ వాగ్దానము చేయవలెను" అని అడుగవచ్చు.

మరియు నాతని యనారోగ్యము మరికొంతకాల ముండి యనేకపరిస్థితులలో కొన్నిసంవత్సరములపాటట్లే తన సహచరుని సహాయ మపేక్షించె ననుకొందము. అట్లపేక్షించు నపుడెల్ల ముందువిధముననే తిరిగి యీ రెండవవాని పొలములో మరికొన్ని గంటలసేపు నాతడు కోరినపుడు పని చేయుటకు వ్రాతపూర్వకమగు వాగ్దానమును చేసెనను కొందము. ఇక నాతడు జబ్బునుండి లేచి యారోగ్యవంతుడై తిరిగి పనిజేయ మొదలిడినపుడు వారిరువుర స్థితు లెట్లుండును?

వారు నివసించు ప్రదేశ మొక రాజ్యముగ నెంచిన, దాని యార్థికస్థితి క్షీణించినదనవలెను. ఆ జబ్బుపడిన వాని కృషివలన కల్గు నుత్పత్తి లేకపోవుటచే నంతదనుక వారి రాజ్యపు ఆర్థికస్థితి క్షీణించును. అతని స్నేహితుడా యధికావుసరస్థితులలో నెక్కువ కష్టపడి పనిచేసియుండును.

అట్లాతడు పనిజేయుటలో వినియోగించినకాలము, బుద్ధి, తన స్వంతభూమికై వినియోగింపకపోవుటచే, తుట్టతుద కాతని స్వంతభూమికిని ఆస్తికినికూడ నంతవరకు నష్టము కల్గి యుండును. వారి యుభయుల మొత్తమాస్తికూడ వారుభయు లారోగ్యముగనుండి కృషి చేసికొనునప్పటికంటె తక్కువగును.

అంతేగాక వారి పరస్పరసంబంధములుగూడ చాల మార్పుచెందును. ఆజబ్బుపడినవాడు కొన్ని సంవత్సరములపా టాతని కృషిని రెండవవాని కిచ్చుటకు వాగ్దానము చేయు టయేగాక వానివద్ద నిల్వయుండిన సరకుల నన్నిటినిగూడ తన జబ్బులో వినియోగించి యుండును. కనుక నతని భుక్తికి సైతము రెండవవానిపై కొంత కాలమాధారపడును. దానికై గూడ నాతడు మరింత ఋణగ్రస్తుడై యుండుటకుగాను మరి కొంతకాలపు కృషిని రెండవవానికీయ నొప్పుకొనును.

అట్లు వ్రాసిన పత్రములన్నియు నిస్సంశయముగ చెల్లుననుకొందము. (అయితే నాకరిక దేశములం దట్లు చెల్లుట న్యాయస్థానముల * మూలమున జరుగును.) ఇంతవర

* ధనముయొక్క యథార్థలక్షణమునుగూర్చి చాల వివాదముగలదు. వివాదుల యభిప్రాయములందలి యథార్థమగు భిన్నభావముకంటె, వారు ధనమొనర్చు కార్యములను వివిధవైపులనుండి పరీక్షించుటవలననే ఎక్కువ వివాదము కల్గుచున్నది. మనము నిజముగ చేర్కొను ధనమంతయు, నిజముగ నంత ఋణము అని భావము. అయితే అది ఋణదాతయొక్క కృషిని, లేక ఆస్తిని నిరూపించునట్లు తలంచవచ్చును; లేదా, ఋణగ్రస్తుని సోమరి తనమునుగాని, పేదరికమునుగాని, నిరూపించునట్లు తలంచవచ్చును. సామా న్యముగ నాణెపు విధానమునకు మూలాధారమగు విలువను, రక్షణమును

శుభయులపని నెరవేర్చిన నాతడిపుడు తన యిష్టానుసార ముగ పనినుండి విశ్రమింప నెంచవచ్చును. తాను సోమరి తనమున కాలముగడుప తలంపవచ్చు. అట్లుండి తన సహ చరుని ఋణ తీర్మానమునకై నిర్బంధించును. అతడు వ్రాయించుకొనిన పత్రములప్రకారము వానివద్దనుండి పని తీసికొనుచుండును. అట్లు పని తీసికొనునపుడు వాని కిచ్చెడు ఆహారమునకై యిష్టమువచ్చిన మొత్తమునకు మరి కొన్ని ఋణపత్రములు భావికృషికై చేపట్టవచ్చును.

ఇందు మొదటినుండి చివరవరకునుగూడ సాధారణ ముగ మన మనుకొనునట్టి యన్యాయమేమియు లేకపోవ చ్చును. కాని ఈ విధమగు నార్థికస్థితిలోనున్న నాతీర ప్రాంతమునకు వేరొకడు నూతనముగావచ్చిన, నాతని కచట నున్న యిరువురిలో నొకడు వ్యాపారరీత్యా ధనికుడుగను, మరియొకడు వ్యాపారరీత్యా పేదవాడుగను నగుబడును. అతడు, బహుశః కడునాశ్చర్యముతో, నొకడు తన కాలమును

---

చేకూర్చుటకు వ్యాపారానుగుణ్యముగ బంగారము, వెండి, ఉప్పు, గవ్వలు మొదలగు వస్తువులు ఆవసరమని తలంచి వాడుటచే నీసమస్య మరింత క్లిష్టమాయెను. కాని ద్రవ్యముయొక్క సరియైన నుత్కృష్టమగు నిర్వాచన మేమనగా-నీవు కోరినపుడు కొంతకృషి నొసంగుటకుగాని, చేకూర్చుటకుగాని, దేశము సమ్మతిపూర్వకముగ నవశ్యము నేరవేర్చుట కొసగు పత్రిమూలక మగు వాగ్దానము. అట్టిచో, ఏవిధమైన నుత్పత్తివస్తువుగూడ సదా నిశ్చిత పరిమాణములో నుత్పత్తికాజాలదుగనుక, నొక యుత్పత్తిసరకును ఒక నిశ్చిత విలువకు కొలప్రమాణముగ గ్రహింపలేము. అంతకంటె ఒక పురుషుడు ఒక దినమున జేయు కృషిని గణనపరిమాణముగ గ్రహించుట మంచిది.

మును సోమరితనమున గడపుటను, మరియొకఁడు క్లిష్టముగ జీవించుచు నెప్పటికైన తన పూర్వ స్వాతంత్ర్యమును తిరిగి బడయు నాసతో, వారి యుభయులకొరకు శ్రమించుటను చూచును.

వ్యాపారవిధానములందు కలిమిలేములెట్లు సంభవించునో, వివిధవ్యక్తులలో నార్థికవ్యత్యాసము లెట్లు నెలకొల్పడునో తెలుపుటకు గల యనేకవిధములలో నిదియొక యుదాహరణము. ఇందుగల యిరువురలో నొకఁడు మొదటినుండియు సోమరితనమున నుండగోరి, ప్రస్తుత సుఖమునకు తన భావి జీవితము నొడ్డవచ్చును. లేదా తనభూమిని తాను సరిగా జూచుకొనక, తన యాహారావసరములకు రెండవ వానిపై నాధారపడి, యందుకుగాను తాను భావికాలమున వానికై పనిచేయుట కొప్పుకొనును. ఈవిధమగు ననేకవిషయములందు సామాన్యముగ వర్తించునది, పాఠకులు గ్రహింపవలసిన ముఖ్యాంశమేమన, నితరుల కృషిపై నధికారసంపాదనముతో గూడు వ్యాపారసంపత్తి నెలకొల్పుట, వాస్తవమగు కలిమితో గూడియుండు రాజ్యాంగసంపత్తి తగ్గుటను సూచించును.

వాణిజ్య వ్యాపారములకు మరింత బాగుగ వర్తించు మఱియొక యుదాహరణము చూతము. పై యుదాహరణమున గల యిద్దరికి బదులు ముగ్గురుమనుష్యులా ప్రజాస్వామిక ప్రభుత్వమున ప్రత్యేక సీమలో నున్నారనుకొందము. వారు ముగ్గురాతీరప్రాంతమునగల భూమిని విభజించుకొని

యొకరికొకరు కొంతదూరముగ కృషిజేసికొనుచుండవలసి
వచ్చెననుకొందము. ఒక్కొక్క రొక్కొక్కరకమైన సరుకు
నుత్పత్తిజేయుచు, ఒకరు మఱియొకరు పండించుదానిపై,
కొద్దిగనో, గొప్పగనో పరస్పరముగ నాధారపడియుండి
రందము. ఇందు వారిలో నొకరియొద్దనుండి మఱియొకరికి కావల
సిన సరకుల నంపకము చేయుటకుగాను (కాలము వ్యర్థము
గాకుండుటకై) మూడవవాడు పూనుకొనెననుకొందము. అట్లు
నిర్వహించుటకుగాను అంపకము జేయబడు ప్రతిసరకునందు
నాతనికి తగిన పరిహారముగ కొంత భాగమాతడు గ్రహించు
నియమము కలదనుకొందము.

ఈవిధముగ వ్యవహరించు మధ్యవర్తి యొకరి సంస్థా
నమునుండి మరియొకరి సంస్థానమునకు కావలసిన ముఖ్యావ
సరములను సకాలమున నందించుచుండిన, నాయుభయకర్షకు
లతిసౌఖ్యముగ సేద్యము సాగింతురు. వారు జేయగలంత
యధికోత్పత్తి జేయుచుందురు. ఆ చిన్నసంఘముయొక్క
భాగ్యసంపద లత్యధికముగ నుండును.

కాని యాభూస్వాములకు వారిమధ్య తిరుగాడు నా
మధ్యవర్తిద్వారా తప్ప మరియేయితర పరస్పర సంపర్కము
సాధ్యముకా దనుకొందము. అప్పుడు కొంతకాలమునకా మధ్య
వర్తి ఆయిరువుర వ్యవసాయకృషిని గమనించుచు, తనకు
ఒప్పగించిన వస్తువులను తనవద్దనే దాచివేయుననుకొందము.
అట్లుజేసి వారిలో నొకరి కాసరకులకై మిక్కిలి అవసరసమ
యము వచ్చువరకు దాచియుంచి, యా మహావసరసమయ

మున యీ సరకుల నాకర్షకున కొసగి, అందుకు బదులుగ పాప మాకర్షకుడొసగగలట్టి నితరసరకులను చాలబడయును. అట్లే యతడు చాకచక్యముగ తన యవకాశముల జూచుకొనుచు వర్తించుట సులభముగ నూహింపగలము. క్రమముగా నాయిరువురుకర్షకుల యధికోత్పత్తిలో చాలభాగమును తాను సంపాదించును. తుదకు ఏకాటక సంవత్సరముననో, క్లిష్టమగు సంవత్సరముననో, వారియుభయుల సంస్థానములను తానే కొనివేసి ముందటి భూస్వాముల నిరువురనుగూడ నప్పటినుండి తనక్రింద కార్మికులగనో, సేవకులగనో నియమించును.

ఇది ఆధునికయర్థశాస్త్ర సూత్రములను సరిగ యనుకరించి ధనార్జనము జేయు నొక విధానము. పూర్వపు ఉదాహరణముకంటె చాలస్పష్టముగ నీవిధానమున నొకటి తేటతెల్లమగుచున్నది. వారు నివసించు నాచిన్నరాజ్యమందలి భాగ్యము లేక వారిముగ్గురి సాంఘికసంపత్తి మొత్తముమీద, నా వ్యాపారస్థు డింతకంటె నధికన్యాయమగు లాభముతో తృప్తి చెంది వ్యవహరించు నప్పటికన్న తక్కువగుట విశదము. ఆయిరువురు వ్యవసాయదారుల పనిపాట్లు నమితముగ నిర్బంధింపబడును. క్లిష్టసమయములందు వారికి కావలసిన వస్తువులు నిరంతర మందకుండుట, అందుకుతోడుగ జీవితసాధనములకై సల్పు నిరంతరపోరాటమువలన కల్గు ధైర్యవికలత, శాశ్వత లాభముపై నేవిధమైన యోచనలేకపోవుట, యివన్నియు వారి కృషిసామర్థ్యములవలని ఫలితములను చాలవఱకు తగ్గించును. ఆవర్తకు డింతకంటె న్యాయముగ వ్యవహరించిన తన

గాదెలు, ఆ కర్షకుల గాదెలుగూడ నిండియుండెడివి. కాని యిప్పుడాన ర్తకుడు తన యన్యాయవర్తనమున జేకూర్చుకొనిన సరకు లెంతమాత్రమును వాటికి సరిగావు.

కనుక నొకరాజ్యముయొక్క ఆర్థికసంపద, దాని యుపయుక్తతను గూర్చినసమస్య, తుదకు న్యాయమును గూర్చిన సమస్యగ పరిణమించును. ఒక రాజ్యమందు కొంత భాగ్యము సంపాదింపబడియుండిన, నాభాగ్యమున్నంతమాత్రమున నది యారాజ్యమునకు మంచిని సూచించునో లేక చెడుగును సూచించునో నిర్ణయించుట సాధ్యముకాదు. గణితమున నొకరాశియొక్క ముందుగల గుర్తుపై నారాశియొక్క పరిమాణ మెంత నిర్ధారణముగ నాధారపడియుండునో యట్లే నొకరాజ్యమందుగల భాగ్యసంపదయొక్క నిజమైనవిలువ దాని నైతికలక్షణములపై నాధారపడియుండును.

వాణిజ్య సంపదభివృద్ధి యొకప్పుడు విశ్వాసపూర్వక పరిశ్రమలను, పురోభివృద్ధికారణమగు సామర్థ్యములను, యుత్పత్తిసాధనమగు మనోవికాసములను సూచించును. మరొకప్పుడు, మృత్యుకారణమగు భోగ్యమును, నిర్దాక్షిణ్య నిరంకుశత్వమును, వినాశకారణమగు కుయుక్తిని సూచించును. అక్రమముగ గూడబెట్టిన పంట యకాలవర్షమున బరువగునట్లు కొన్ని సంచితభాగ్యములు మానవులకన్నిటితో భారముగ నుండును. ఒక్కొక్క బంగారము సహజమగు స్వచ్ఛతతోకన్న సూర్యరశ్మియం దధికముగ ప్రకాశించును.

ఇవి ధనార్జనాసక్తుఁడు తన యిష్టానుసారముగ నివసింపగల నేవియో నైతికమైన, విచారసూచకమైన సామాన్యముగు భాగ్యలక్షణములు మాత్రము గావు. అవి యథార్థముగ నిష్కర్షగ గణించవలసిన ధనలక్షణములు. అవి ధనముయొక్క విలువను గణనాసాధ్యముగ తగ్గించును, లేక హెచ్చించును. ఒక ధనరాశి సృజనభూతమగు క్రియాఫలితముగావచ్చును. మఱియొకటి నాశనభూతమగు క్రియాఫలముగావచ్చును, ఒకదానిని సంగ్రహించునపుడే దానికి పదిరెట్లగు సంపదను సృష్టించును. మరియొకటి పదిరెట్లుగ నాశనమొనర్చును. విషమూలికను తిని మత్తెక్కి నిర్జీవమైన గతిని ఎంతెంత బలమైన హస్తముల స్తంభీకృతమొనర్చెనో, ఎందరి ధైర్యస్థైర్యముల వికలమొనర్చెనో, ఎన్ని యుత్పత్తి కార్యముల కాటంకపడెనో, డ్యూరా మైదానమున ప్రతిష్ఠించిన యసత్యదేవతయొక్క బంగారు విగ్రహమును ఆరాధించవలెననియు, అట్లారాధించనివా రేడుసార్లు కాల్చిన యగ్నికుండములో త్రోయబడుదురనియు నొసంగిన నేసత్యవిరుద్ధమగునాజ్ఞ కార్మికుల కీయబడెనోకదా!

భాగ్యముగ గనబడునది నిజమున కతిదూర నాశనమును జూపు మెఱుగుచిహ్నము గావచ్చును. ఒక నావికుఁడొక వ్యాపారనౌకను మోసపుచ్చి యొక తీరమునకు గొట్టుకొని ధ్వంసమగునట్లుజేసి, పిదప నాతీరమున సంగ్రహించిన చే నిండు నాణెములవంటిది. తోడి సైనికుల మృత కళేబరములపై నుండు దుస్తులను విప్పుకొని సంగ్రహించిన

గుడ్డలమూటవంటిది; పౌరుని పరదేశనిగూఢ సమాధి జేయుటకు కొన్నట్టి కుమ్మరివాని భూముల కిమ్మతున కిచ్చిన లంచపు నాణెములవంటిది.

కనుక, నైతికమూలముల పరిశీలనముతో ప్రసక్తి లేకుండగనే ధనసంపాదనవిధానముల నొసగగలమనుట గాని, జాతీయాచరణకై క్రయలాభములగూర్చిన నేదైన సామాన్యశాస్త్రసూత్రమును ప్రతిపాదింపవచ్చు ననుట గాని, మానవులను దురభ్యాసములచే మోసగించిన యోచన లన్నింటిలో కడు దురహంకారమైన నిష్ప్రయోజనమగు యోచన యనవలయును. "అతి చవుక బజారులో కొనుము; అతి ప్రియమైన బజారులో నమ్ముము" యను వ్యాపార సూత్రము, దేశపు ఆర్థిక విధానమున యవలంబించవలసిన సూత్రమనియు, అన్ని పరిస్థితులయందు యవలంభింపగలట్టి దనియు నాధునిక భావము. నాకు తెలిసినంతవఱకు, మానవ బుద్ధినైపుణ్యమున కింతకంటె యవమానకరమగు నదేమియు చరిత్రలో వ్రాసియుండ లేదు.

మిక్కిలి చవుకయగు బజారులో కొనుము?- అవును; కాని నీ బజారునేది చవుకగ జేసెను? ఒక యగ్నిప్రమాదము వెనుక నీయింటి కలపయందలి బొగ్గు చవుకగా నుండవచ్చును. ఒక భూకంపము తరువాత నీబజారులందు యిటుకలు చవుకగా నుండవచ్చును. అందువలన, యగ్నిప్రమాదములు, భూకంపములు దేశమునకు శ్రేయోదాయకములా? మిక్కిలి ప్రియమగు దానిలో నమ్ముము? అవును, నిజమే; కాని నీబజారు

నేది ప్రియముగ జేసెను? ఈదినము నీ రొట్టెలను బాగుగ మంచిధర కమ్మితివి; అయితే, నిక నెన్నటికిని రొట్టె యక్కర లేక చావసిద్ధముగనున్న వాని తుది నాణెమునకా? లేక రేపటిరోజున నీభూమిని కొని నిన్ను తరిమివేయు భాగ్యవంతు నకా? లేక నీ సర్వస్వము దాచియుంచుకొన్న ధనాగారమును కొల్లగొట్టుటకు బోవుచున్న సైనికునికా నీవు రొట్టె లమ్మినది?

ఈ విషయములలో నేయొక్కదానిని నీవు తెలిసికొన లేవు. కాని ఒక్కవిషయము మాత్రము నీవు తెలిసికొన గలవు. అదేమన, ఈవిధమగు నీ వ్యాపారము న్యాయాను సారముగను విశ్వాసపూర్వకముగ నున్నదా లేదా యని మాత్రము తెలిసికొనగలవు. అదియే యీ విషయమున నీవు తెలిసికొనవలసినది; నీకు సంబంధించినది. అట్లు గమ నించుచు నీకార్యము నీవు నిర్వహించిన ప్రపంచములో దోపిడికి, మృత్యువునకు దారితీయని వ్యవస్థను తుట్టతుదకు తప్పక తేగలవు. అట్లే ఈ విషయములకు సంబంధించిన ప్రతి సమస్య తుదకు న్యాయమునుగూర్చిన గొప్ప సమస్యతో కలిసియుండును. ఇంతవర కీ విషయమునుగూర్చి విశదీకరించి తిని. ఇంకను తరువాత వ్యాసమున పరిశీలింతును. పాఠకుల విచారణకై మూడు తుదివిషయములుమాత్ర మిచట చెప్పి విడుతును.

ధనముయొక్క ప్రధానమగు విలువ, సుగుణము మానవులపై దానికిగల యధికారమునందు గలదని చూపి

తిమి; అట్టి అధికారమే లేనిచో నెంత గొప్ప సంపదయు నిష్ఫలమనియు నట్టియధికారమే యుండిన మానవునికి గొప్ప యాస్తిగూడ ననవసరమనియు చూచితిమి. కాని మానవులపై నధికారము కేవలము ధనమూలముననేగాక నితర సాధనములవలనగూడ చేకూర్చుకొనవచ్చును. ముందుజెప్పి నట్లు ధనాధికార మెప్పుడు నపవిత్రమైనది, సంశయాత్మకమైనది. ధనముతో పొందలేనివనేకములు గలవు. దానితో నుంచుకొనజాలని యితరములుగూడ జాలగలవు. బంగారముతో కొనజాలని నెన్నియో యానందములు మానవులు బడయవచ్చును. దానితో బహూకరింపజాలని భక్తివిశ్వాసము లెన్నియో మానవులందు గాంచవచ్చును.

ఇవి కడు సామాన్య విషయములేయని చదువరులందురు. అవును; అయితే యంత సామాన్యములుగావు. అంత సామాన్యములైన బాగుండెడిది. ఈ నైతిక శక్తి యగమ్యము, యగణ్యమునై యుండును. అయినను, ఇందలి ద్రవ్య విలువయే నాణెముల విలువ యంతటి నిజమగు విలువను గల్గియుండును. ఒకని చేతినిండ కనబడనట్టి ధనముండవచ్చును. ఆ చేతినూపినగాని, దానితో పట్టుకొనినగాని, మఱియొకడు బంగారు వర్షమును కురిపించిన దానికంటె నెక్కువ సిద్ధించును. మఱియు నీయగుపడని ధనము వెచ్చించు కొలది తప్పక తఱుగబోదు. అర్థశాస్త్రజ్ఞులెన్నటికైన దీనిని గణింపలేకపోయినను, పరిగణించిన బాగుండును. ఇంకను, ధనముయొక్క సారాంశము మానవులపై నధికారమునందు

గలదు గనుక, మనకు బయటికగపడునట్టిది నామకాయను కొనునట్టి భాగ్యమునం దీశక్తి లేనిచో దాని సారాంశమే శూన్యము; నిజమున కది భాగ్యమేకాదు. మానవులపై మన యధికారము నిరంకుశమని యిటీవల మనకు దోచుటలేదు. నౌకరులు తమ వేతనములు సక్రమముగా చెల్లించుటలేదన్న భావమున నతి యుద్రిక్తతతో మేడమెట్లెక్కుదురు. అందొకవిధమగు స్వభావమును జూపుదురు. అనుదిన మీ విధముగనే తగు మనిషి యింటిలో జరిగినను ఆతని యాస్తికనర్థము వాటిల్లనున్నదని యూహింపవచ్చును.

అట్లే ఒక్క నౌకరులను సమదాయింపలేకపోవుటయందేకాదు; వారికి సౌఖ్యమును చేకూర్చునెడగూడ మన భాగ్యప్రభావమునకు మితియున్నట్లు దోచును. వంటింటి పనివాండ్రకు ధరింప సరిగ దుస్తులులేక, దారిద్ర్యముతో నర్ధాకలితో వారుండిన, నాయింటివారిసంపద కేవలము వర్ణింపవలసినదిమాత్రమే యగును. పత్రములలో నున్నట్టిదే యగును.

చివరకు, ధనముయొక్క సారాంశము మానవులపై నధికారమునందుగలదు గనుక, నట్టి మానవు లెంత యుత్తములై నెంత యధికసంఖ్యాకులుగనున్న నంత ధనాధిక్యతను సూచించుననవలదా? బహుశః ఇంక నాలోచించిన నామానవులే ధనముకాదా? వారిని మన యిష్టానుసారముగ వర్తించునట్లు జేయుటకు మన ముపయోగించు ద్రవ్యనాణెములు నిజముగ పూర్వ మనాగరికులకు తళతళ మెరయుచు

నానంద మొసగుచుండెడి గుజ్జుపుజీనువంటివి ; అలంకార ములవంటివేగాని యధికము కావు. కాని ఆ జంతువులను వాటినోళ్ళలోను చెవులలోను జిగిబిగిలాడెడు యాభరణము లతో వేధించుటమానిన, నవి వాటికి తొడిగిన జీనులకంటె నధిక విలువైనవిగ నుండును.

యథార్థముగ ధనముయొక్క నిజమగు నాడు లెజ్జగా నుండునని గ్రహింపవచ్చును. మాంసమందుగాని, రాతియం దుండవు. ధనముయొక్క తుదిప్రయోజనము, ఫలిత మునుగూడ సంపూర్ణజీవులను, వికాసవంతులను, ఆనంద హృదయులను ఎందరిని వృద్ధి జేయగల్గిన నందరిని వృద్ధిజేయు టయే యగును. మన యాధునిక ధనప్రసారవిధాన మన్యథా యున్నట్లు తలంపవచ్చును. చాలమంది యర్థశాస్త్రజ్ఞులు మానవు లధికసంఖ్యాకులైన భాగ్యప్రమోదమున కనుగుణముగాదని యెంచుదురు. లేదా యట్లధిక సంఖ్యాకులైనవారు వికాసహీనులై, క్షీణశరీరులై యుండుటయే భాగ్యమున కత్యనుగుణమనియు, నెంచుదురు.

ఎట్లయినను, జాతీయపరిశ్రమలలోనెల్ల సద్గుణాత్మ లను వృద్ధిజేయుట తుదకన్నిట మిన్నయగు లాభకరమైనది కాదాయని మరియొకసారి యందును. దీనిని తీవ్రముగ ప్రశ్నింపవచ్చునుగాని చదువరులే దానిని నిర్ణయింతురుగాక. కడు దీర్ఘకాలమునకైన, మన మూహింపజాలని కాలమున నైన, మన యింగ్లాండుదేశ మీవిధమగు భాగ్యసంపా దనాయోచనలను విడిచి, తొల్లి యే యనాగరిక దేశముల

నుండి యుదయించిరో అచటికే తిరోగమింతురనిగూడ భావింపగలను. మరియు, సింధునదీ యిసుకలందలి బంగారము, గోలుకొండ వజ్రములు, యుద్ధాశ్వముల కవచముల నలంకరింపకముందే. చౌనిస తలపాగనుండి మెఱయకముందే, మన దేశమొక క్రైస్తవ మాతగ, యొక సామాన్యమగు నమాయికయొక్క సుగుణసంపదలతో తనపుత్రిల "వీరే నాయాభరణములు" అనుచు పురోగమించుగాక.

---

# ఆర్థిక న్యాయము

క్రీస్తుశకమునకు పూర్వము కొన్ని శతాబ్దముల ముందు, ఆఫ్రికాదేశమున గోల్డుకోస్టు అను ప్రాంతమున పెద్ద వ్యాపారముచేయు జ్యావర్తకు డొకడుండెను. అతని కాలములో నాత డత్యధిక ధనమును సంపాదించెనని ఖ్యాతి పొందెను. వ్యావహారికజ్ఞానమునగూడ చాల గణుతి కెక్కెను. అతడు తన చిట్టాలలో భాగ్యమునుగూర్చిన కొన్ని సూక్తులను వివరించి విడిచెను. వింతగా నవి ఈనాటికిని భద్రముగ నుంచబడెను. మధ్యయుగమునాటి ప్రముఖ వ్యాపారస్థులందరు వాటిని చాల గౌరవముతో చూచుకొనిరి. అందును ముఖ్యముగ వెన్నిస్‌వర్తకులు వాటిని చాల కొనియాడిరి. గౌరవసూచకముగ వారి ప్రధానభవనములయం దొకమూల వర్తకుని విగ్రహమునుగూడ నుంచిరి.

ఇటీవల నవి యాధునిక వాణిజ్యసాంప్రదాయమునకు ప్రతివిషయమున విరుద్ధముగనుండి కొంత యపఖ్యాతి పాలాయెను. ఎట్లైననేమి యందలి యొకటి రెండు చిన్న భాగముల నిక్కడ వివరింతును. కొంతవరకు చదువరులకు నవి వింతగనుండి కుతూహలమును కలిగించవచ్చును. మఱియు ముఖ్యముగ, వ్యావహారిక నిపుణుడు, ధనార్జనోద్యుక్తుడు నగు నేవణిజుడైనను తన వ్యాపారమును విజయవంతముగ సాగించుటకు సదార్జనవలని భాగ్యమునకును దురార్జనవలని భాగ్యమునకును గల భేదమునుగూర్చిన సూక్ష్మమును

దృష్టియం దుంచుకొని వ ర్తించవచ్చుననిగూడ నా సూ క్తులు చూపును. ఆ భేదమునుగూర్చి గత వ్యాసమున కొంతవఱకు రూఢిగ జెప్పితిని. దాని నిపుడు పూ ర్తిగ పరిశీలింపవలసి యున్నది.

ఉదాహరణముగ నాతడొకచోట "అబద్ధమాడు నాలుకవలన నార్జించు సంచితభాగ్యము మృత్యువును జేరు వానిముందు వెనుకల కూగాడు నాడంబరమగును" అని చెప్పెను. ఇదే అర్థముతో, వింతగా రెట్టించుచు, మఱియొక చోట "కూ్రరత్వము వలని భాగ్యము లాభశూన్యము; కాని న్యాయము మృత్యువునుండి రక్షించును" అని చెప్పెను. ఈరెండు సూ క్తులును చాల సుప్రసిద్ధమైనవి. అన్యాయార్జిత వి త్తముయొక్క నిజమగు సంచితఫలములు మృత్యువని నిశ్చయముగ చెప్పను. "అబద్ధమాడునాలుక" యనుటకు బదులు "అబద్ధపుపేరు, అబద్ధపుబిరుదు, నటన, లేక ప్రకటన" యని యందుమూ, ఆధునికవాణిజ్యమునకా మాటలు మఱింతస్పష్టముగ వ ర్తించుట విశదము.

అట్టి వ్యాపారమున మానవకృషియొక్క నిజమైన విధానము మృత్యువును జేరుటయని యద్భుతముగ చెప్ప బడెను. సాధారణముగ మృత్యువు మనలను వెంబడించునని, మనము దానినుండి పారిపోదుమని అందుము. కాని యది యరుదుగ నే కొద్ది విషయములలోనో సంభవించును. సామాన్యముగ మృత్యువు చాలయందముగ తేజోవంతముగ నగుపడునట్టి వేషము దాల్చును. ఒక రాజకొమా ర్తెవలె

సంపూర్ణమగు నాంతర్య తేజమునుగాక, బహిర్గత తేజమును మాత్రము గల్గియుండును; మెరుగు బంగారమును ధరించును. సదా మన జీవితకాలమందెల్ల దాని నావేశముతో వెంబడింతుము. అది సదా మననుండి పారిపోవుచుండును; లేకున్న మనకగపడకుండ దాగుకొనుచుండును. మన డెబ్బదిసంవత్సరముల జీవితాంతమహోత్తరవిజయము ఖచ్చితముగ పూర్తిగా మృత్యువును చేపట్టి, దాని నిత్యసత్యములగు దుస్తులను బుగ్గిని, బాధను చేకొందుము.

మఱియు నావర్తకుడు "ఎవరు తమ ధనాభివృద్ధికై పేదల నణగద్రొక్కుదురో వారు తప్పక దారిద్ర్యము నొందుదురు." అని చెప్పెను. ఇంకా దృఢముగ "పేదగదాయని పేదల దోచుకొనకుము. వర్తకము పేరిట బాధపడు వారిని నణగద్రొక్కకుము. ఏలయన, వారిని పాడుచేయు వానియాత్మను దేవుడు పాడుచేయు"నని గూడ చెప్పెను.

ఈ విధముగ "పేదగదాయని పేదలను దోచుట" ముఖ్యముగ వాణిజ్యరూపపు దొంగతనము. ఒకవ్యక్తియొక్క యవసరములనుబట్టి మంచి యవకాశము తీసికొని వాని కృషినిగాని ఆస్తినిగాని తక్కువధరకు బడయుదురు. ఇందుకు వ్యతిరేకవిధమున సాధారణముగ దారిదోపిడివారు, ధనికులు గదాయని ధనికులను దోచెదరు. వర్తకునిమనస్సునకీవిధమగు దోపిడిచేయ తఱచు తోచదు. బహుశః కారణమేమన; ఇది బీదలను దోచుటకంటె తక్కువ లాభకరము, ఎక్కువ హానికరము. దీనిని విచక్షణబుద్ధిగలవారభ్యసింపరు.

కాని యన్నిటికంటె మిక్కిలి యెన్నదగిన భావగర్భితమగు నీరెండు సూక్తులు గలవు.

'ధనికులు, బీదలు కలిసిరి. దేవుడు వారికర్త'

'ధనికులు, బీదలు కలిసిరి. దేవుడు వారి జ్యోతి'

'కలిసిరి' యనగా నొకరు మఱియొకరి మార్గమున కెదురగుదురని చెప్పవలెను. అనగా, ప్రపంచమున్నంతవరకు కలిమిలేములయొక్క చర్య ప్రతిచర్యలగు ధన దారిద్ర్యము లెదురెదురుగ ముఖాముఖిగలియుట తథ్యము. ఇది ప్రపంచమున నిర్ణీతమైనట్టి అనివార్యమగు సూత్రము; నది సముద్రమును జేరునట్లును, మేఘములు విద్యుచ్ఛక్తిని మార్చుకొనునట్లును, అవశ్యముగ జరుగవలయును. "దేవుడు వారికర్త".

ఐతే, ఈవిధమగు చర్య సరళముగను, న్యాయముగను, నుండవచ్చును; లేదా ఉద్ధృతముగను, వినాశన భూతముగను, ఉండవచ్చును ; సర్వనాశన మొనర్చు నుప్పెనయొక్క యుగ్రత కావచ్చు, లేదా ఉపయుక్తముగ ప్రవహించు నదీతరంగ ప్రశాంతత కావచ్చు; నల్లగమాడ్చివేసి ధ్వంసము చేయు పిడుగు కావచ్చు; లేదా, నిరంతరము శక్తినొసగు జీవాగ్నిచే నెమ్మదిగ ధ్వనించుచు దూరమునుండివచ్చు ప్రేమగీతిక కావచ్చును. ఇందేది బడయనగునో,ధనికులు బీదలుగూడ దేవుడే వారి వెలుగని గ్రహించుటపై నాధారపడియుండును. మానవజీవితమాయలో, నొండొరులను ముఖాముఖి జూడగల్గి నివసించుటకే వెలుగుదప్ప

నితరమేమియు లేదు. ఈ వెలుగునే యావర్తకునిసూక్తులు గల మరియొక గ్రంథమున "న్యాయభానుడని* వ్రాసెను. ఆ న్యాయమనెడు సూర్యుడు తుదకు విధిగ నుదయించును. తన రెక్కలనుకిరణములతో స్వస్థపరచును; అనగా ఆరోగ్యకారియగును, సహాయభూతమగును, పరిశుద్ధమొనర్చును; లేదా సఖ్యపరచు నను భావములో నతడు చెప్పెను.

ఏలయన, నిజముగ నీవిధముగ స్వస్థపరచుట,యొక్క న్యాయమువలననే సాధ్యమగును; ప్రేమగాదు, విశ్వాసముగాదు; ఆశగాదు; మరేమియుగూడ స్వస్థత చేకూర్చనేరవు. తొలుత న్యాయశీలురు గాకున్న మానవులవివేకముగ అనురాగమును, ఆడంబరముగ విశ్వాసమును జూపుదురు. తరతరంబులుగ, మానవోత్తము లొనరించిన గొప్పపొఱపాటు, దానముతో బీదలకు సహాయపడదలచుట, ఓర్మిని యాసను

---

* ఇంకను నిర్దుష్టముగ చెప్పవలెనన్న "న్యాయత్వ మను సూర్యుడు" అనవలెను. ఇచట 'న్యాయము' నకు బదులు 'ధర్మము' అనగా 'దైవపరత్వము' అను భావములో వాడుటచే నాపదముయొక్క యథార్థభావమునకు భంగముగల్గును. 'ధర్మము' అనునది ఒకచట్టమునుగాని ఒకహక్కునుగాని యనుసరించిన న్యాయమగును. దీనిని 'న్యాయము' అనగా సరితూగు న్యాయము నుండి విచక్షించవలయును. ఇంకను ధారాళముగ చెప్పవలెనన్న, ధర్మము ప్రభున్యాయము; న్యాయము, న్యాయాధికారి యొసగు న్యాయము. ఒకటి అందరిని పాలించు ప్రభువొసంగు న్యాయము. రెండవది, వివాదులను విచక్షించి విచారించి న్యాయాధికారి యొసగు న్యాయము. అందువలననే, న్యాయము ద్వివిధముగ నుండును. ఒకటి ఎన్నికతోకూడి అనుభవయోగ్యమగు న్యాయము—ప్రభున్యాయము; రెండవది ఒక నిబంధన ననుసరించి యొసగు న్యాయము, ఆచరణ యోగ్యమగు న్యాయము.

గూర్చి వారికి హితోపదేశము చేయనెంచుట, వారి నుపశ మించుటకును యూరడించుటకు నితర సాధనములన్నియు నవలంబించుట యేగాని దేవు డాదేశించిన న్యాయమొక్కటి దక్క తక్కిన సాధనములన్నియు నుపయోగింతురు.

ఐతే, పవిత్రనుగు, సహాయభూతమైన ఈన్యాయము క్లిష్టసమయమున మానవోత్తములచే సైతము నిరాకరింపబడును; సామాన్యప్రజలు అది గనబడుచోటనెల్ల నసహ్యించుకొందురు. అట్లే, ఒకానొకసమయమున వారిని స్వేచ్ఛగా నెవరినైన నెన్నుకొమ్మని కోరిన...వారొక సహాయభూతుని న్యాయానువర్తనుని నిరాకరించి, యొక హంతకుని, ద్రోహిని, దోపిడిదొంగను ఎన్నుకొని వారి కిమ్మందురు. ప్రాణదాతకు బదులు ప్రాణఘాతకుని, శాంతిప్రభువునకుబదులు సంక్షోభకారకుని, ప్రపంచమంతకు న్యాయపాలకుడగువానికిబదులు మ్లేచ్ఛుని కోరుకొందురు.

ధనప్రభావముయొక్క ప్రతిరూప భాగముగ జల ప్రవాహములు సముద్రమును జేరుట నుదాహరించితిని. ఒకవిధముగ నది ప్రతిరూపముయొక్క భాగము మాత్రమే గాదు, సంపూర్ణమగు ప్రతిరూపమగును. భాగ్యము లేక ఆస్తియొక్క సాధారణ వివిధరూపము లవసరానుసారముగ బోవునని జను లామోదించు నర్థశాస్త్రజ్ఞుడు కనిపెట్టెను. అందుకు తాను చాల వివేకవంతుడనని తలంచును. అనగా ఎక్కడ యవసరము గలదో అక్కడకు అంపకము జరుగును. ఈవిధమగు నవసరమునుపట్టి అంపకము జరుగు విధానమును

మానవనిబంధనలేవియు నిర్బంధింపలేవనిగూడ నతడు ఘోషించును. సరిగ నదేవిధముగ నదే నిశ్చయముతో ప్రపంచమున నీరుగూడ కావలసినచోటికి ప్రవహించును. భూమి వల్లనైన నీరు ప్రవహించును. మేఘపుకడలను, నదీప్రవాహములను మానవచిత్తము నిర్బంధింపనేరదు.

కాని వాటి వినియోగమును, పాలనమును మానవుని దూరాలోచనమువలన మార్చవచ్చును. ఒక ప్రవాహము సంక్షేమకారి గావచ్చు లేక సంక్షోభకారి గావచ్చు. ఎట్లగుటయు, మానవకృషిపైనను, పరిపాలనాబుద్ధినైపుణ్యము మీదను ఆధారపడియుండును. ప్రపంచమున నతి ఫలవంతమైన గొప్ప భూభాగములు (అనుకూలశీతోష్ణస్థితి గల్గియు) అందు ప్రవహించు నదులయొక్క యుద్ధృతముననే యనేక శతాబ్దములుగ నెడారులుగ నుండెను. ఎడారులుగనే గాదు, క్షోభాపీడితమైగూడ యుండెను. సక్రమముగ ప్రవహించు నట్లొనర్చిన, జలప్రవాహము మెల్లగ పొలమునుండి పొలమునకు ప్రవహించును. అచటి గాలిని శుభ్రపఱచును. మనుజునకును జంతువునకునుగూడ నాహార మిచ్చును. వారి జీవిత భారమును తన రొమ్ముపై మోయుచు వారికి సౌఖ్యమిచ్చును. అట్లుగాకున్న నొక్కొక్కపుడు, ఆ ప్రవాహమే పొర్లి ముంచివేయును. వాయువును కల్మషముగ జేయును. జాడ్యములకు క్షామమునకు కారణమగును.

అదేవిధముగ ఈభాగ్యముగూడ "కావలసిన చోటికి బోవును". ఏ మానవ నిబంధనలును దాని ప్రవాహము నడ్డ

గింపలేవు. దానికి దారిమాత్రము జూపగలవు. త్రవ్వినకాల్వ, వేసినగట్టు ఈపనిని సంపూర్తిగ నిర్వహింపగలవు. అప్పుడా నీరు ప్రాణాధారజల మగును. ఆసిరులు వివేకముతోడి భాగ్యమగును. లేక, అట్లుగాక, చాల తఱచు జరుగునట్లు, ఆ ప్రవాహమునకే కట్టడిలేక దాని యిష్టానుసారముగ ప్రవహింపవిడిచిన, నది దేశ సంక్షోభమును, ప్రాణనాశనమును కలుగజేయును. మాదానదీ జలమగును. సమస్త యనర్థపు మూలముల బోషించును.

ప్రసారము, ప్రతిబంధములగూర్చిన ఈ నియమముల యవసరమును, అర్థశాస్త్రజ్ఞుని "శాస్త్రము" యొక్క సాధారణమైన నిర్వచనము వింతగ నుపేక్షించును. క్లుప్తముగ నతడు దానిని "ధనవంతమగుటనుగూర్చిన శాస్త్రము"నును.

కాని ధనవంతులగుటకు చాల శాస్త్రములు గలవు; చాల కళలుగూడ కలవు. గొప్ప భూస్వాములకు విషము పెట్టుట ఒక సాధనముగ పూర్వము ఎక్కువగ నుపయోగించిరి. చిన్న భూస్వాముల ఆహారపదార్థములలో కలితీ జేయుట ప్రస్తుతము ఎక్కువ వాడుకనందున్నది. ప్రాచీన కాలమున దారిదోపిడివారు గౌరవముగ లంచములు గొనుట, ఆధునికకాలమున కొంత తక్కువ గౌరవమైనది సరకుల నరువునకు బడయుట, యితరమైన స్వాయత్తపరచుకొను ననేకవిధముల పెంపొందిన విధానములును; (పెద్దతరహా పరిశ్రమలయందేమి, చిన్నరకపు పరిశ్రమలయందేమి) తుదకు యిటీవల బుద్ధిప్రాబల్యమున నేర్చిన కడు నిపుణతతో చేయు

జేబుదొంగతనమును—, ఇవన్ని యును ధనవంతమగుటనుగూర్చిన శాస్త్రములు, కళలే యగును.

కనుక, ప్రజలకిష్టుడగు నార్థికవేత్త ధనవంతమగుట గూర్చిన తన శాస్త్రమును యుత్కృష్టమగు శాస్త్రమనిన, దాని స్వభావమునకు కొన్ని నిషిద్ధలక్షణములు జేర్చవలసి యుండుట విశదము. అతడు తన శాస్త్రమును "చట్టాను సారముగగాని న్యాయానుసారముగగాని ధనవంతమగుట" గూర్చిన శాస్త్రమని తలంచును. ఇట్లనుకొనుటలో నాతనిని గూర్చి పొరపాటుగ జెప్పుటలేదని తలంతును. ఈ నిర్వచనమున "న్యాయముగ" యను మాటా? లేక "చట్టానుసారముగ" యనునదా? నిర్ధారణ జేయవలసినది ఏలయన' కొన్ని దేశములందుగాని, కొందరు పరిపాలకుల క్రిందగాని, కొందరు న్యాయవాదుల సహాయమునగాని, వ్యవహారముల తీర్పులు చట్టానుసారముగ నుండవచ్చునుగాని, ఎంతమాత్రము న్యాయబద్ధముగనుండకపోవుట సాధ్యము. కనుక, తుదకు మన నిర్వచనములలో "న్యాయబద్ధముగ" యను మాటమాత్ర ముంచితిమా, ఈయొక్క చిన్నమాట మన శాస్త్రముయొక్క వ్యాకరణమునందు గొప్ప భేదము కల్పించును.

అపుడు శాస్త్రీయముగ ధనవంతులు గావలెనన్న, న్యాయముగ ధనవంతులు కావలయును యని వెంటనే యనవలసి యుండును. కనుక, నేది న్యాయమో తెలిసికొనవలయును. అప్పుడు మన యార్థికవిధానము ఒక్క వివేకము మీదనేగాక న్యాయవివేకముమీద నాధారపడి యుండును.

మానవకల్పితన్యాయమునిూదగాక దైవకల్పితన్యాయముపై నాధారపడును.

అట్టి వివేకము నికృష్టమగు వివేకముగాదు. మహోన్నతమగు స్వర్గసీమ కెగయునట్లుండి, నిరంతరమా న్యాయ భానుని తేజమును పరికించుచుండును. అట్టి యుత్కృష్ట వివేకుల యాత్మలను 'డేంటీ'యను నాతడు మింట నక్షత్రములుగ వర్ణించెను. ఆ నక్షత్రములు వినువీథిని దూరదృష్టిగల పక్షిరాజైన డేగయొక్క కంటియాకృతిగ నుండునని వర్ణించెను. ఆ జీవాత్మలు అంధకారమునగూడ వెలుగును జూడ గలవు. శరీరకాంతితో, నా పవిత్రాత్మలు మానవజాతికెల్ల కండ్లవలె నుండును. ఇక నాపక్షిరాజుయొక్క పక్షంబులుగ నుండు యాత్మలు, న్యాయమునకు పుష్టిని, పాలనాధికారము నిచ్చును. పక్షపవనముల స్వస్థపరచును. స్వర్గమునగల శాసనముపై వెలుగు ప్రసరించి "భూమిపై న్యాయమును పాలించు మీరు ధర్మమును ప్రేమించుడు" యను మహాశాసనమును జూపును.

"భూమిపై న్యాయమును పాలించు మీరు, న్యాయమునకు తమ శ్రద్ధాపూర్వకమైన ప్రేమ నొసగుడు" అని గలదు. సామాన్యమగు ప్రేమ మాత్రమేగాదు, శ్రద్ధాపూర్వకమగు ప్రేమ. అనగా నతిజాగరూకతతో నితరము లన్నిటకంటె నుత్తమమని ఎంచుకొను నట్లొనర్చు ప్రేమ నొసగుడు.

ఈ న్యాయ పరిశీలనమునుగాని భూమిపై న్యాయపరి పాలననుగాని, ఒక్క న్యాయాధికారులు, పరిపాలకులు మాత్రమేగాక అందరు మానవులును* వారి వారి శక్త్యను సారముగ వారివారి స్థానములనుబట్టి నిర్వహింపవలసి యుండును. సహాయభూతులు శ్రేయోదాయకులగు "మహాత్ములని" పిలువబడు క్రైస్తవమహాపురుషులగూర్చి నుడువు గ్రంథములలోని భాగములు తమకును వర్తించునని తలంచుటకు సిద్ధపడువారుసైతము మీసత్యమును కడు విచారముగ నుపేక్షింతురు. పరిపాలనాకార్యముల నెరిగి నిర్వహింపవలసిన "ఎన్నుకొనబడిన ప్రభువులు" సైతము ఈ సత్యమును కడు విచారకరముగ నుపేక్షింతురు. అసహాయపరులు, అసమర్థులగు పురుషులు, మహాత్ములవలె, ప్రభువులవలె నటించుట చేతనే ఆ బిరుదుల నిజమైన అర్థము చాలకాలము క్రిందటనే పోయినది. మరియు మహాత్ముల పవిత్రత, ప్రభువుల రాజ

* ఒక న్యాయవాదిపని న్యాయము చేకూర్చుట అని నేను వ్రాసినదానికి చాలమంది న్యాయవాదు లాశ్చర్యపడినట్లు నేను వింటిని. నేనట్లు ఎంతమాత్రముగూడ పరిహాసమునకు చెప్పలేదు. న్యాయమును నిర్ణయించుటనిగాని, న్యాయమిచ్చుటనిగాని, న్యాయవాదుల కార్యమని నేను చెప్పలేదు. ఐతే దేశమందలి వివిధ యోధములు, సైనికులు, బోధకులు, శాసనసభ్యులు అందరునుగూడ వీలుగ జాతీయ పరాక్రమమున, వివేకమున, న్యాయమున ప్రవర్తించిన ఆ దేశమునకు శ్రేయము. బోధకుడు అనగా వ్యుత్పత్త్యర్థప్రకార మందరు ఉపాధ్యాయులు అని భావము. న్యాయవాది అను దాని వ్యుత్పత్త్యర్థమ ప్రకార శాసనకారులు, శాసనవిపులీకరణము చేయువారు అని భావము.

త్వము, దయ. న్యాయపాలనములందుగాక, పొడుగైన దుస్తులను, ఎత్తైన కిరీటములను ధరించుటయందే గలవను సామాన్యపు అపభ్రమవలనగూడ నా బిరుదులనిజార్థము నశించినది. నిజమగు సకల పవిత్రతత, సర్వరక్షణాశక్తియం దుండును. నిజమగు సార్వభౌమత్వము పరిపాలనాశక్తియం దుండును. అట్టి శక్తిని యుపలక్షించుటయందే యన్యాయము వాటిల్లును. "ఆ యుపలక్ష్యము, మానవులను తమపైన ఏ ప్రభువును లేనట్టి ప్రాకెడి కీటకములట్లును, సముద్రమందలి చేపలట్లును* జేయును.

అంకురితన్యాయము అమంకురితసత్యమువలె యసంభవము. కాని ధర్మాత్ముని, వానికి న్యాయముయెడల గల వాంఛ, కుతూహలములనుబట్టి, అధర్మాత్మునినుండి విచక్షింతుము. అట్లే సత్యవంతునికి సత్యముయెడ గల వాంఛ కుతూహలములనుబట్టి అసత్యవంతునినుండి విచక్షింతుము. మరియు నకుంఠితన్యాయ మసాధ్యమైనను, మన నిత్య వ్యవహారములకు కావలసిన న్యాయము, న్యాయదృష్టి గలవారందరకును సాధ్య మగును.

ఇప్పుడు కార్మికుని కూలినిగూర్చి నన్యాయసూత్రముల పరిశీలింతము. ఇవి న్యాయశాస్త్రముయొక్క మూలములందంత చిన్నవిషయములు గావు.

---

* చేపలు, ఎలుకలు, తోడేళ్ళు మొదలగువాటియోగ్యత, అవసర అంపకముల నిబంధనానుసారము జీవించుట; కాని మానవకోటిమాత్రము ధర్మనిబంధనల ననుసరించి జీవించుటయే వారి విధి.

పూర్వశీర్షికయందు సంక్షేపముగ వేతనమునుగూర్చిన భావమును కడు స్వల్ప మాటలలో సమూలముగ చెప్పితిని. ఆమాటలలోనే దాని నైజము, దానిగురించిన న్యాయ నియమములను నిర్ణయింపగలము.

మనకై కృషినొనర్చిన ఒకనికి మన మొసగు వాగ్దానమున వేతన మనునది సమూలముగ నిమిడియుండును. అతడీ దినమున మనకై సేవజేయుటయందు గడపిన కాలము, ఇచ్చిన కృషికి సమానమగు కాలమును, కృషిని భావికాలమున అతని కవసరమైనపుడు అతని కిచ్చుటకుగాని చేకూర్చుటకుగాని మనము జేయు వాగ్దాన మగును.*

---

* మొదట నాకృషియొక్క బజారుధర ఆవిధమగు మారకమును తెలుపునట్లగుపడును. కాని అదియొక వింతభావన. ఏలయన, బజారుధర అనునది కావలసిన నొకవిధమగు కృషియొక్క తాత్కాలిక ధర అని చెప్పనగును. కాని న్యాయమగు ధర అనునది మానవకోటియొక్క యుత్పత్తి శ్రమకు సమానమగు ధర అగును. ఈభేదమునుగూర్చి వేఱొకచోట పరిశీలింతము. ఇచట కృషియొక్క మారకపువిలువను గూర్చి మాత్రమే చెప్పచున్నాను గాని, సరకులయొక్క మారకపువిలువను గూర్చి చెప్పుటలేదని గ్రహించవలెను. ఒక సరుకుయొక్క మారకపువిలువ దాని నుత్పత్తిచేయుటకు కావలసిన కృషియొక్క విలువ, ఆసరుకుయొక్క అవసరాధిక్యము— వీటిరెండింటి లబ్ధము అగును.

కృషియొక్క విలువ అనగా అవసరముయొక్క యాధిక్యము = మారకపువిలువ అనగా, ఇందు కృషియొక్క విలువగాని, అవసరముగాని, ఏది శూన్యమైనను, సరకుయొక్క మారకపువిలువగూడ శూన్యమగును.

మనకొనర్చిన కృషికంటె తక్కువప్రతిఫలము నొసంగ వాగ్దానము చేసితిమా, అతనికియ్యవలసినదానికంటె తక్కువ చెల్లించినట్లగును; ఎక్కువప్రతిఫలము నొసంగ వాగ్దానము చేసితిమా, అతనికెక్కువ చెల్లించినట్లగును. వాఙుకయందు, అవసర లభ్యముల నిబంధన ననుసరించి, ఒక పనిని నిర్వహించుటకు ఇరువురు కార్మికులు సంసిద్ధముగనున్న, ఆపని గొను నాతడొక్కడే యుండిన, నా యిరువురు కార్మికు లొకరితో నొకరు పోటిగ తక్కువ వేతనమునకు సిద్ధపడుదురు. అప్పుడాపనికి నియమింపబడినవానికి సరియగు కూలికంటె తక్కువ చెల్లింపబడును. కాని పనిని గొనదలచిన వా రిద్దరుండి, పనినిర్వహింప సిద్ధముగనున్న వా డొక్కడేయుండిన, ఆపని గొనదలచిన వారొకరితొనొకరు పోటిగ, నాపనివానికి సరియగు వేతనముకంటె నెక్కువ చెల్లించును.

ఈరెండు విషయములందలి అన్యాయమును వరుసగా పరిశీలింతము, కాని మొదట, సరియగు వేతనము, న్యాయమైన వేతనము యను రెండింటియందుగల ముఖ్య సూక్ష్మమును చదువరులు స్పష్టముగ గ్రహింతురుగాక.

ఎవరినైన మనమొక సేవజేయమని కోరిన, నతడా సేవను మన కుచితముగ జేయవచ్చును, లేదా ప్రతిఫలమును కోరవచ్చును. మన ప్రస్తుత సమస్య యుచితసేవనుగూర్చి కాదు; ఏలయన నది సాభిమానమైనదిగాని వ్యాపారముగాదు. అతడు వేతనమును కోరిన, అతనియెడ మనము సమగ్ర న్యాయమొనర్ప నెంచిన, అట్టి న్యాయ మాతని కాలమునకు

కాలము, బలమునకు బలమును, చాతుర్యమునకు చాతుర్యమును ఒసగుటయందే గలదనుట విశదము. ఒకడు మనకై ఒక గంట కాలము పనిచేసిన, తిరిగి మన మాతనికొఱకై ఒక అరగంటకాలమే పనిచేయవాగ్దానమొసగిన, దానివలన మనకు అన్యాయమగు సౌకర్యము చేకూరును. అట్లుగాక, మన మాతనికై గంటన్నరసేపు పనిజేయ వాగ్దానము చేసిన, అతనికి అన్యాయమగు సౌకర్యము చేకూరును.

న్యాయము సమగ్రమగు మారకమున గలదు. లేదా, ఉభయపక్షముల స్థానములు గౌరవనీయమైనచో, అది యజమాని కనుగుణముగ నుండదు. నిశ్చయముగ, ఒకడు పేదవాడుగ నుండుటకు ఏన్యాయమగు కారణములేదు. ఒకడు నా కీదినమున నొక పౌను రొట్టె నిచ్చిన, అతనికి మఱునాడు పౌనురొట్టెకంటె తక్కువ యిచ్చుట ఎట్లు న్యాయము ? అదే విధముగ,నొకడు విద్యాహీనుడై యుండుటకుగూడ ఏన్యాయమగు కారణములేదు. ఒకడు నాసేవకై కొంత జ్ఞానమును నైపుణ్యమును ఉపయోగించిన తిరిగి ఆతనికై అజ్ఞానము నైపుణ్యముకంటె తక్కువ ఉపయోగించుట న్యాయమా ? తుదకు, కనీసముగ నేను గ్రహించినదానికంటె నెంతో కొంత యధికముగ తిరిగి యిచ్చుటయే సౌమ్యముగ నుండును; యుచితమనిగూడ దోచును.

కాని మనమిపుడు, సరియైన, శుద్ధమగు మారకమును గూర్చి అనగా న్యాయనిబంధనలగూర్చి యోచింపవలసి యున్నది. న్యాయమగు పరిహారమునుగూర్చిన మూలభావము

కనుస్వల్పమైనది. ఆస్వల్పమగు నైజముతో నొక్క యంశము మాత్రము పురస్కరించుకొనుచుండును. విత్తనమునకు ఫలమువెట్లో సరిగ నడుపబడుకృషికూడ నట్లే ఫలప్రదముగ నుండును. అట్లు మొదట, మనకొసగబడిన కృషియొక్క ఫలితమునుగాని లబ్ధినిగాని మనము గణనజేయవలెను. దానికి మరికొంతకృషినిజేర్చి, మనము తరువాత తిరిగి చెల్లించు పరిహారమును సరిపుచ్చవలెను.

అట్లు పరిహారమును చెల్లించుట ఒక సంవత్సరాంతమున జరుగుననుకొందము. లేదా, ఏదైన కొంతకాలము తరువాత జరుగుననుకొందము. అపుడీవిధమగు గణనమును సుమారుగ సరిపోవునట్లు చేయగలము. కాని, ద్రవ్యమును అనగా, నగదుగ చెల్లించునపు డీ విధముగ కాలమును సంబంధించి నిర్ణయింపరు.ఏలయన,నట్లు ద్రవ్యమును గ్రహించినవాడు దానిని వెంటనే ఖర్చుచేయవచ్చును. లేదా కొన్ని సంవత్సరములవెనుక ఖర్చుపెట్టవచ్చును. అది వానియిష్టము. అట్లుముందు కృషియొనర్చినవారికి కొంచెము ఎక్కువ సదుపాయము చేకూరునట్లు ఇచ్చుట న్యాయమని సాధారణముగ మన మనుకొనవచ్చును. అప్పుడు ఆబేరము తీరుయిట్లుండును. ఈదినము నీవు నాకై ఒకగంటకాలమునిచ్చిన, నీవు కోరినపుడు నీ కొకగంటపైన అయిదునిముసములకాలము ఇచ్చెదను, ఈదినము నాకొక పౌను రొట్టెనిచ్చినచో, నీవు కోరినపుడు నీకు పౌనుపైన నొక ఔన్సు అధికమగు రొట్టెను ఇచ్చెదను. ఇట్లే తరువాయివిషయములును.

ఇక్కడ పాఠకులు గ్రహింపవలసినది సంగ్రహముగ నేమన, పనికి ఇచ్చెడు పరిహారము కనీసము పనికి చెల్లింపవలసినదానికి తక్కువగుట న్యాయముకాదు.

కార్మికునికి చెల్లవలసిన న్యాయమగు సరియైనకూలిని గూర్చిన భావ మేమన, మన మతనికి చెల్లించు ద్రవ్యము అతడు మనకొనర్చినపనికి కనీసము సమానమగు ప్రతిఫలము నైన నతని కెప్పుడైన చేకూర్పగల్గునంతటిదై యుండవలెను. అట్లు చెల్లించునది, అధిక ప్రతిఫలమును చేకూర్చునట్లుండుట మంచిదిగాని, తక్కువగ మాత్రముండరాదు. ఈ విధమగు న్యాయమైనకూలి, ఆపని నిర్వహించుటకు గల పనివాండ్ర సంఖ్యతో నిమిత్తములేక యుండవలెను.

నాగుజ్జమునకు కాలినాడు ఒకటి కావలెను. అది చేయుటకు ఇరువదిమంది కమ్మరులు సిద్ధముగ నుండవచ్చును; లేదా, ఇరవై వేలమంది సిద్ధముగనుండవచ్చును, ఐతే దానిని నాకు చేసియిచ్చినవానికి నేను చెల్లించవలసిన కూలి వారిసంఖ్యతో నణుమాత్రము సంబంధముగల్గియుండరాదు. దానిని చేయుట కాతనిజీవితకాలములో పావుగంటకాలమును, కొంతచాతుర్యమును, భుజశక్తిని నాతడు వెచ్చించెను. కనుక న్యాయముగ నేను ఆతనికి భావికాలమున, నాజీవితకాలము నుండిగాని నా యధీనమునందున్న మరియేయితరునిజీవిత కాలమునుండిగాని, ఆపావుగంటకాలమును మరికొన్ని నిముషములధికకాలమును, అంత చాతుర్యమును, భుజశక్తిని,

మరి కొంచెమధికముగ నతని యవసరమున నతనికి చేకూర్చవలయును.

ఇది న్యాయమగు పరిహార వేతనమునుగూర్చిన సిద్ధాంతము. ఐతే నిత్యకృత్యమున నీవిధానము కొంత మార్పు చెందును. గ్రహించెడు పని ప్రత్యేకస్వభావము కల్గియుండును. చెల్లించు ద్రవ్యము సర్వసామాన్యరూపము కల్గియుండును. వాడుకయందుండు నాణెరూపమునగాని, అదే విలువగల పత్రిపురూపమునగాని చెల్లింతుము. అట్టినాణెము గాని పత్రము లేక నోటుగాని, ఏదైన కొంతకృషికై దేశమున కిచ్చిన యాజ్ఞయని నిజార్థము. ఈవిధమైన ద్రవ్యము ఏ అవసరమునకైన సర్వోపయుక్తముగనుండుటచే ప్రత్యేకానుగుణమగు కృషికంటె కొంత ఎక్కువ విలువ గల్గియుండును. కనుకనే, ఎక్కువ పరిమాణముగల ప్రత్యేకమగు కృషికి, సర్వసాధారణమగు కృష్కై యొసగు తక్కువ విలువగల యనుజ్ఞను, ద్రవ్యమును, న్యాయమైన సమానపరిహారముగ సదా యంగీకరింతురు. ఏపనివాడైనను అట్టి సర్వసామాన్యమగు జాతీయమగు అరగంటకాలపు కృషికి లేదా యింకను తక్కువకాలపు కృషికి తనగంటకాలపు ప్రత్యేక కృషి నొసంగ సదా సమ్మతించును.

ఇదియే, సరియగు వేతనమును నిశ్చయముగ నిర్ణయింపజాలకుండుటకు మూలకారణము. దీనికితోడు చాతుర్య

మునకు* సరియగు ద్రవ్యపువిలువను నిర్ణయించుటగూడ కష్టసాధ్యము. ఈ విషయములవలన నేదైన నొక పనికి

* 'చాతుర్యము' అనగా అందు అనుభవము, బుద్ధి, భావోద్రేకము, వీటిప్రసక్తికలదు. కాయకష్టమునం దుపకరించు మొత్తపుశక్తియని నా అభిప్రాయము. ఇక 'భావోద్రేకము' అను పదమున నైతికమనోభావములు సర్వము ఇమిడియున్నట్లు తలంతును. సామాన్యమగు నోర్మి, నెమ్మది— ఇవియే కృషికి సొబగునిచ్చును; కృషిని అవిరళముగ సాగించును; విసుగులేక మంచిఫలితమును చేకూర్చును. మరియొకనికంటె రెట్టింపుకాలము కృషిసల్పునట్లు చేయును. ఈ మనోభావములు మొదలుకొని, ఏదైన శాస్త్రమును సాధించునట్టి మానవప్రవర్తనశీలముయొక్క లక్షణములవరకు గల భావములన్నియు నందిమిడి యుండును. (ఒక్క అసూయాభావమే కదా ఈ శతాబ్దమందలి ఆర్థికశాస్త్రాభివృద్ధికి నిరోధకమై మిక్కుటమగు కష్టము కలుగజేయుచున్నది.) ఈ మనోలక్షణములు సర్వకళలయొక్క అమూల్యతకు మూలము, తొలిసాధనములై ప్రస్తావింప వీలులేనట్టి భావసంచయము, భావనాశక్తులు — సర్వముగూడ 'చాతుర్యము'న నిమిడియున్నవి.

అర్థశాస్త్రజ్ఞులు, తమ ప్రతిగణనమునను, ఈ నైతికలక్షణములను గాకపోయినను, భావోద్రేకమునైన ననవద్యమగు లక్షణముగ నింతవరకు గ్రహింపకుండుట చాలవింతగా నున్నది. 'మిల్' అను నతడిట్లు వ్రాసెను. "కేవలముత్పత్తిరీత్యా చూచినను, పదార్థముయొక్క న్యాయమునుబట్టి చూచినను, సామాన్యమగు ఆలోచనముయొక్క ప్రాముఖ్యత కేవిధమైన మితిని నిర్ణయించుట సాధ్యముకాదు" అని చెప్పెను. సామాన్యపు "మనోభావము" అనునదిగూడ దానికిచేర్చవలసిన యవసరముగలదని అతడు గ్రహింపలేదు. ఆ మనోభావము సామాన్యపు ఆలోచనకంటెగూడ నతి ముఖ్యము. ఏలయన, ఆయన కార్మిక కృషిని నిర్వచించుటయం దీ భావమును గమనించెను. ఒక ప్రత్యేకపు కార్యమును నెరపుటయం దుపయోగపడు ఒకని ఆలోచనతో కలిసియుండు ఒకవిధమైన అసమ్మతిసూచకమగు సర్వమనోభావములని నిర్వచించెను. నిజమేకాని "సమ్మతిసూచకమగు

తగిన కూలిని సుమారుగనైన నిర్ణయించుట చాల క్లిష్టముగ దోచును. కాని ఇవి మారకపు సూత్రమునకు వర్తించవు. పనియొక్క విలువ (సులువుగ) తెలియకపోవచ్చును. కాని ఒక పదార్థమునకు సాంద్రత ఎంత నిశ్చయముగ గలదో, పనికిగూడ విలువ యంత నిశ్చయముగను గలదు. ఒకపదార్థ మితరవాటితో కలిసియున్నపుడు దాని సాంద్రతను గణించుట ఎట్లు కష్టతరమో, అట్లే ఒక కృషియు నితరములతో గూడియున్నపుడు దాని సరియైన విలువనుగూడ నిర్ణయించుట కష్టము. ఐతే సామాన్య అర్థశాస్త్రము నందు సాధారణముగ నిర్ణయింపబడు గరిష్ఠ, కనిష్ఠ పరిమాణ

---

మనోభావములు"కూడ ఏలకాదు, కృషికి వెనుదీయునట్లు జేయు మనోప్రవృత్తినే కృషిలోని భాగము కాదనియు నెంచరాదు. మొదటి కృషియందు, వెనుదీయు మనోప్రవృత్తికిని అందలి నొప్పిదమునకును వేతనమును చెల్లింతుము. రెండవవిషయమున కృషికి తోడ్పడు మనఃప్రవృత్తిని శక్తిసామర్థ్యముగ పరిగణించి చెల్లింతుము. మొదటిదానిలో కార్మికునికి నష్టము కలుగకుండ మాత్రె మొప్పంద పడుదుము. కాని రెండవదానిలో కృషియొక్క మారకపు విలువలోని ఒకభాగము నుత్పత్తిచేయుట జరుగును; ఉత్పత్తియొక్క వస్తువరిమాణమునుగూడ హెచ్చుచేయును.

"మనవద్ద ఒక గొప్ప సైన్యాధికారి గలడు. అతడు యాభైవేలమంది పెట్టుమనకు" నిజముగ మనశక్తి చాల యినుమడింపబడెను. అయితే ఆశక్తి ఆసైన్యాధికారియొక్క బుద్ధియందే లేదు. అతనియెడ అతని సైనికుల హృదయములందుగల ప్రేమాధిక్యమందేగలదు. "మనోభావనలశక్తియొక్క పరిమితి నిర్ణయింపలేము". నిజము; నిర్ణయింపలేము. గాని ఎప్పటికైన నీమనోభావన ఉత్పత్తికి చాల అనుగుణముగ నుండునని గ్రహించుము, అట్టి వస్తుసముదాయోత్పత్తి అంతకంటె విలువైన పదార్థరహితములగు వాటి యుత్పత్తికి తొలిమెట్టు అని గ్రహింతురుగాక.

ముల నిర్ణయించునంతటి కష్టముగాని సంశయముగాని యుండదు.

అట్లే అమ్మెడువా డింతకంటె తక్కువవెల నంగీకరించడని ఖచ్చితముగ కొనుగోలుదారుడు నిర్ణయింపలేడు. అట్లు నిర్ణయింపగల బేరములు చాలకొద్ది గలవు. క్రియదారు డింతకంటె ఎక్కువ (విక్రియదారునకు) ధర చెల్లింపడను సంతుష్టితోడి నమ్మకముదప్ప నధిక ముండదు. ఇట్లు ఖచ్చితమగు ధరను నిర్ణయించుట యసాధ్యమని ఎఱిగియు జనులు ఇతరులనెంత విసిగించనగునో అంతవరకు విసిగించుటకుగాని హానిజేయుటకుగాని ప్రయత్నింపక మానరు. మరియు, మిక్కిలి తక్కువనుగాని, మిక్కిలి ఎక్కువనుగాని నిజముగ జెప్పలేకున్నను, మిక్కిలి తక్కువకు కొని, మిక్కిలి ఎక్కువకు అమ్మము అను శాస్త్రీయ సూత్రమును అంగీకరింపక మానరు.

ఒక న్యాయవర్తనుడు తాను న్యాయమగు ధర చెల్లించవలెనని శాస్త్రీయసూత్రముగ జెప్పును. ఐతే, అట్టిన్యాయమగుధరను అతడు ఖచ్చితముగ నిర్ణయింపలేకున్నను, ఎట్లో సాధ్యమైనంతవరకు దానికి సుమారగు ధరను తెలియయత్నించును. వ్యవహారయుక్తనుగు సుమారుగ సరియగు ధర నాతడు తెలిసికొనగలడు. ఒకడొనర్చినపనికి నతడు వాని యవసరములనుబట్టి ఎంతతీసికొనునో నిర్ణయించుటకంటె, నాతడెంతన్యాయముగ గ్రహించవలెనో శాస్త్రీయముగ నిర్ణయించుట సులభము. అతని యవసరములను చాల

అరమరికగ నిర్ణయింపగలముగాని యతనికి సరిగ చెల్లింపవల సినది, క్రమవిభజనముగ పరిశీలింపగలము. ఒకదానిలో, ఇచ్చిన సమస్యకు సరియైన జవాబు నొసగుటకు, సరిపడు జవాబునకై కలవరపడు విద్యార్థివలె ప్రయత్నింతువు. మరియొకదానిలో నీజవాబును సరిగ లెక్కించి కొద్ది భేద ములో తెల్పుదువు.

ఒకనియమితమగు పనికి తగిన న్యాయమగుకూలి నిర్ణయించబడెననుకొందము. ఆపనిని గొనువానికి లేదా యజమానికనువగుస్థితికూడ కలదనుకొందము. అనగా నిద్దరు మనుష్యులా పని సల్పుటకు సిద్ధముగనుండ ఒక్కడే ఆపని గ్రహించుట కపేక్షించునని యనుకొందము. అప్పుడు న్యాయ మగువేతనము చెల్లించుటవలన తొలిఫలితము లెట్లుండును ? అన్యాయనుగు వేతనమును చెల్లించుటవలన తొలిఫలితము లెట్లుండును ? అనునది పరిశీలింతము.

అన్యాయవేతనమును చెల్లింపజూచునాతడు ఆయిరు వురు కార్మికులు తమకూలి మిక్కిలి తక్కువగ జేసి యడుగునట్లు వారిలోవారికి పోటీకల్పించును. అందొకడు కనీసపుకూలికి పనిజేయనంగీకరించును. వాడాపనిని న్యాయమగుకూలిలో సగముకూలీకే చేయ నంగీకరించునని యనుకొందము.

ఆపని గొననెంచు యజమాని వీనినే నియమించును. ఆరెండవవానిని నియమించడు. అందువలన తొలిఫలితముగ నాయిరువురిలో నొకనికి పనిలేకపోవును. లేదా తిండిలేక

పోవును. అయితే...మంచిపనివానికి సరియగుకూలి నొసగెడు న్యాయవిధానమునగూడ నట్లే రెండవవాడు నిరుద్యోగిగ యుండును. నా తొలివ్యాసమున నేను వివరించిన స్థితులను అసంభవములని నిరూపింప యత్నించినవారెల్ల ఈ విషయమును గమనింపలేదు. అన్యాయముగ కూలినిచ్చి, పనిని గ్రహించువాడు యిరువురు కార్మికులకును పనిని కల్పించినట్లగునందురు. కాని న్యాయముగ కూలినిచ్చువానికంటె నన్యాయముగ కూలినిచ్చువాడు ఎంతమాత్ర మధికముగ నిద్దరు కార్మికులకు నుద్యోగమిడడు. తొలుతనే ఒక భేదము గలదు; ఏమన, న్యాయప్రవర్తనుడు తాను నియమించిన వానికృషికి సరిపడునట్లు కూలినిచ్చును; అన్యాయప్రవర్తనుడు కృషికి సరిపోని కూలి నిచ్చును.

'తొలుతనే' యంటిని; అనగా. మొదట గనపడు భేదము యథార్థముగు భేదము కాదు. అన్యాయ ప్రవర్తనమున, పనికి న్యాయముగ నియ్యవలసిన కూలిలో సగము యజమాని చేతిలో మిగులును. దానితో వాడు మరియొక కార్మికుని యింకొకవిధముగు తనపనికి అదే అన్యాయ వేతనమునకు నియమించగల్గును. పర్యవసానమేమన, ఆతనికై పని చేసిన ఇద్దరు కార్మికులను అర్థవేతనములపై నియమించును. మఱియిద్దరికి పనియుండదు.

ఇక న్యాయప్రవర్తనమున, మొదటిపని కియ్యబడు నిండుకూలియంతయు నాపనివాని చేతిలో పడును. యజమాని చేతిలో నేమియు మిగులకపోవుటచే నాతడు వేఱొకపనికి

వేఱొకనిని నన్యాయముగు నర్థకూలికి నియమింపజాలఁడు. కాని ఈవిధముగ నతనిశక్తి ఎంతవఱకు తగ్గునో, అంతకును నిండు కూలిగ్రహించిన కార్మికునిశక్తి హెచ్చును. ఇట్లధికపు సగము కూలితో నా కార్మికుఁడు తనస్వంతపనికై వేఱొక కార్మికుని నియమించును. ఐతే మొదట నతడు న్యాయమగుకూలి గ్రహించియు, పిదప తనస్వంతపనికై నియమించువాని కన్యాయముగ సగముకూలినిమాత్రము చెల్లించుటజరుగును. ఇది యతని కనువుగనుండిన, తాను సగముకూలికే యింకొకని నియమించును, ఇదిచాల యనర్థకమైనను, కడుసాధారణముగ జరుగును.

ఇపుడు, తుదిపర్యవసానము, ఒక కార్మికుడు తన యజమానికి న్యాయమగు నిండు వేతనమునకు పనిచేయును; మరియొక డా కార్మికునికై సగము వేతనమునకే పనిచేయును. మొదటిపద్ధతివలెనే, మఱియిద్దరు కార్మికులు పనిలేకయుందురు. ఇట్లిద్దరు పనిలేకుండుట రెండువిధానములందును సంభవించునని ముందే చెప్పియుంటిని. ఐతే న్యాయవిధానమునకును, అన్యాయవిధానమునకును భేదము, నియమింపబడు పనివాండ్ర సంఖ్య యందు లేదు; కాని వారికియ్యబడిన వేతనములందును, వారికి చెల్లించెడు వ్యక్తులెవరు అను విషయమునను గలదు. ఇందు చదువరులు స్పష్టముగజూడసగు నతిముఖ్యమైన భేదము గలదు. అన్యాయపువిధానమున నిరువురు కార్మికులును మొదటి యజమానికొక్కనికే పనిచేతురు. న్యాయపువిధానమున ఒక కార్మికుడు మొదటియజమానికి పనిచేయును. మరియొక డా

పనిజేసిన కార్మికునికై పనిజేయును. ఇట్లే, క్రింది పైతరగతు లన్నిటను విపరీతములగు సేవకును జరుగును. ఈవిధానమే సదా న్యాయమువలన పురోగమించును, అన్యాయమువలన నణికట్టబడును.

ఈ విషయమున సర్వత్రి న్యాయమొనర్చు కార్య మేమన, అనేకమందివ్యక్తులపై నొక్కవ్యక్తి చేతిలో నుండు ధనప్రభావమును తగ్గించును. ప్రజలందరిలో వరుసగ నొకరివెంబడి నింకొకరికి ఆధనప్రభావము లభించునట్లు జేయును. భాగ్యముయొక్క నిజమైనప్రభావ మీ రెండువిధానములం దును నొక్కవిధముగనే యుండును. కాని అన్యాయపు విధా నమునలన నా ప్రభావమంతయు ఒక్కని చేతులోనే యుండును. అతడు తనచుట్టునుగల యనేకులపనిని తన యిష్టానుసార మొకేప్రాబల్యముతో నాజ్ఞాపించును. న్యాయపువిధానమున, నాతని ధనప్రభావము తనచేరువనుండు ఏయొక్కనిపైననో వినియోగపడును. అతనిద్వారా యితరులకును ఆ ధనప్రభా వము సంక్రమించును. ఒకరినుండి ఇంకొకరికి సంక్రమించుచు, క్రమముగతగ్గుచు, క్రొత్తమనుజుల మనోబలముచే మార్పు చెందుచు, తుదకు తనంతటతానే యంతరించును.

ఈ విధానముగ న్యాయనిరతియొక్క సత్వరకార్యము మొదట సౌభాగ్యసంపాదనను, పిదప నైతికపరిసక్తియందును, ధనముయొక్క పరిభావమును తగ్గించుటగును. యజమాని తనస్వార్థమునకై యసంఖ్యాకులగు కార్మికులకృషిని గొన

లేదు. అట్టి యసంఖ్యాకులగు జనుల మనస్సులనుగూడ తన చిత్తాధీనము జేసికొనలేదు.

న్యాయముయొక్క ద్వితీయకృత్యముకూడ ఏ మాత్రము తక్కువ ముఖ్యమైనదిగాదు. అనేకులు ఒక్కనికై పని జేయునపుడు వారికియ్యబడు చాలీచాలని వేతనములు, వారిలో ప్రతివానికిని తనస్థితిని యభివృద్ధిజేసికొనుటకును అత్యధిక కష్టముకల్గించును. అందుచే నాపద్ధతియొక్క స్వభావము పురోగమనము నాటంకపరచును. కాని సరియైన వేతనమునుగాని న్యాయమగు వేతనమునుగాని నక్షోశ్రేణిని వరుసగ ప్రతితరగతి పనికిని *పంచియిచ్చిన, ఆ క్రిందితరగ

* కొందరురచయితలు, కార్మికకృషియొక్క విరములను, తెరహాలను, పరిమాణమును పనియొక్క లక్షణములనుండి విచక్షింపక, ఈ శీర్షికలందు నేను చెప్పినపనిని నిర్ణయించువిషయములను స్పష్టముగ గ్రహింపకుండిరి. అట్టి సంశయనివారణ మత్యావసరము. ఒక సైన్యాధికారికిగూడ ఒక సామాన్య సైనికునివలెనే చెల్లింపవలెననిగాని, ఒక ప్రధానమతాధికారికిగూడ ఒక సామాన్యబోధకునికివలెనే చెల్లింపవలెననిగాని నే నెన్నడును చెప్పలేదు. ఎక్కువశ్రమకు, తక్కువశ్రమకుగూడ నొకేవిధముగ చెల్లింపవలెననిగూడ చెప్పలేదు. రెండువేలమంది జనులుగల గ్రామమతబోధకునికిని, అయిదువేల మంది జనులుగల గ్రామమతబోధకునికిని ఒకేవేతనము చెల్లింపమని నా అభిప్రాయముకాదు. కాని ఒక్కవిషయముమాత్రము చెప్పితిని. నీవు వినియోగించునపుడుమాత్రము మంచిపని కెట్లుచెల్లింతువో చెడుపనికిగూడ నట్లే ఏ మాత్రము తగ్గించక చెల్లింపవలెను. ఒక శక్తిహీనుడగు మతబోధకునికిని, ఒక మంచిబోధకునికిని ఒకేరీతిగ నెట్లుచెల్లింతురో, ఒకచెడువైద్యునికిని, మంచి వైద్యునికిని గూడ నొకేరీతిగ నెట్లుచెల్లింతురో న్యాయవాదులుగూడ తమ ఖర్చుల నెట్లుబడయుదురో, అదేవిధముగ ఒక పాడుపనివానికిగూడ మంచి పనివానికి చెల్లించునట్లే చెల్లింపవలెను. ఇదే నేనంటిని; ఇకముందును అం

తిలోనుండు ప్రతివానికిని సాంఘికనిశ్రేణి పైమెట్టున కెగయు టకు వీలగు సముచితసాధనములు చేకూర్చును. అతడు వాటి నుపయోగించుకొన నెంచిన నుపయోగించుకొనవచ్చును. ఇట్లు భాగ్యముయొక్క సత్వరప్రభావమును తగ్గించుటయేగాక, దారిద్ర్యము యొక్క నికృచ్ఛదౌర్బల్యముల గూడ తొల గించును.

తుదకీ ముఖ్యసమస్యపైననే కార్మికునియోగమంతయు నాధారపడియుండును. అనేక చిన్నవిషయములు దానితో పురస్కరించునట్లు కొన్నిసమయములందగుపడవచ్చును, గాని యవియన్నియు దానినుండియే వెలువడును. ఒక దృష్టాంత ముగ, కిందితరగతులవారు తమ వేతనములనుండి చెల్లించు సుంకమును వారు నామకః చెల్లింతురు లేదా యదార్థముగ చెల్లించునట్లగుపడుదురు. ఆసుంకములు తమ వేతనములందు నూటికి సుమారు ముప్పదిఅయిదు లేక నలుబదిపాళ్లు

---

దును. ఏలయన, యదార్థముగ సుప్రసిద్ధముగుపనిని సొమ్ముతో నెన్నడును బడయనేరము. కాని మనము మంచిపనివానికిని, పాడుపనివానికిని గూడ నొకే విధముగ చెల్లింపవలెని గ్రహించుటతోడనే, మంచిపనిని పాడుపనినుండి విచక్షింతుము. అపుడు పాడుపనిని గొనజాలను. ఒకప్రచురణకర్త, ఒక సామాన్యరచయితకును, నుత్తమకవులకును గూడ నొకేవిధముగ చెల్లింప వలెనా? అని నన్నొక కవిఅడిగెను. వారిని వినియోగించినపుడు వారికట్లే చెల్లింపవయును అందును. ఐతే అట్టిసామాన్య రచయితను నియోగించుట నా సమ్మతముగాదు, అట్టి రచయితకును శ్రేయముగాదు; ఆ ప్రచురణకర్త కును శ్రేయముగాదు. అట్టి సామాన్యమగు రచనలకై ఒకదేశమందలి ధన మును వెచ్చించుట యుచితమగు నార్థికవిధానము కాదు. ఈ ప్రశ్నవడుగు బుద్ధిసైపుణ్యముగల రచయితనే, ఆరచన నచ్చువేయుటయందుకన్న నధికోప యోగమునకై వినియోగించి యుండరా?

అని వారు గ్రహించినచో, వారి మనస్సులయందు చాల ఆందోళనము గల్గును. ఇదిచాల విచారకరముగ దోచును కాని నిజముగ నాసుంకమును కార్మికుడు చెల్లింపడు. వాని యజమానియే చెల్లించును. ఏలయన, కార్మికుడాసుంకమును చెల్లింపవలసిన యవసరములేనిచో, అతనికూలిగూడ నంత మట్టునకును తగ్గును. పోటీవలన ఆ వేతనమతడు జీవమాత్రావశిష్టుడై యుండ సాధ్యమగునంతటి తక్కువకు తగ్గించబడును.

వెనుక బీదప్రజలందరును ధాన్యముపై సుంకమువలన*

---

* నిరాటంకమగు వాణిజ్యమునుగూర్చి నామిత్రుడొకడు నాకు లేఖ వ్రాసెను. నేను కడునిర్భయముగ, నిస్సంకోచముగ, యథేచ్ఛగా వ్యవహరించువాడనని అతడాశ్చర్యముతో గ్రహింపవచ్చును. ఏడుసంవత్సరముల క్రితము యూరోపు శైశవావస్థయొక్క లక్షణములను వివరించుచు, 'వెన్నీసుశిలలు' అను నాగ్రంథములో నిట్లు వ్రాసితిని. "వాణిజ్యమును గూర్చిన తొలిసూత్రములను కొద్దిమాసములక్రిందటనే ఇంగ్లాండునందు శాసనసభ ఆమోదించెను. స్వేచ్ఛాపూర్వకమగు వాణిజ్య సాధనముల కనుమతించెను. కాని జనబాహుళ్యము వాటినేమాత్రమును అర్థముచేసికొనలేదు. ఏదేశమునుగూడ ఇంతవరకు దిగుమతుల, ఎగుమతుల సుంకవిధానమును రద్దుచేయ సాహసింపనేరకున్నది.

ఇందు పరస్పరానుమతినిగూర్చికూడ నేనంగీకరించుటలేదని తెలిసికొనవలెను. కావలెనన్న ఇతరదేశములు తమ రేవులను మూసివేయనిండు. వివేకముగల ప్రతిదేశము తన ఓడరేవులను తెఱచియుంచును. వాటిని తెఱచియుంచుటవలననే ప్రమాదము వాటిల్లదు. నిజముగ ప్రమాదము, వాటిని ఆలోచనాశూన్యమున, ఏవో బుద్ధిహీనమగు పరిశోధన విధానములననుసరించి వాటిని హఠాత్తుగా తెఱచుటవలననే కల్గును. ఒక ఉత్పత్తిదారునికి చాలకాలముగ రక్షణమొసంగుచుండిన, అట్టి రక్షణమును హఠాత్తుగ తొలగింపరాదు. అట్లు తొలగించిన, అందలి పనివాండ్రందరు నొకేసారిగ

తమకు చాల కష్టతరముగ నున్నదనియు, ఆసుంకమును తొలగించిన తమకుఆహారము చౌకగ లభించగలదని తలచి ఆందోళనముచేసిరి. కాని ఆహారము శాశ్వతముగ చౌకగాయున్న తమ వేతనములుగూడ నట్లే శాశ్వతముగ నదేనిష్పత్తిలో తగ్గుననువిషయము వారు గ్రహింపలేకుండిరి. ధాన్యముపై సుంకము సక్రమముగ తొలగించిరి. ఐతే, అది

---

యుద్యోగములనుండి తొలగింపబడుదురు. ఒక నీరసపు బిడ్డను శీతలమునుండి రక్షించుటకై తొడిగిన దుస్తులను, అవి అనారోగ్యకరముగనున్నను, హఠాత్తుగ విప్పివేయరాదు. కొద్దికొద్దిగ వాటిని తొలగించి, ఆబిడ్డకు స్వేచ్ఛను కల్పించవలెను; గాలిని గ్రహించునట్లొనర్చవలెను.

నిరాటంకమగు వాణిజ్యవ్యాపారమునుగూర్చి అనేకుల మనస్సులందొక వింతగు భ్రమ కలదు. ఏలయన, వారు నిరాటంకమగు వాణిజ్యమున నధికమగు పోటీగలదని అనుకొందురు. అట్లుకాదు, సరికదా, నిరాటంకమగు వాణిజ్యముపోటీని అంతరింపజేయును. వాణిజ్యమున "రక్షణము" అనేక దుష్టచేష్టలకు కారణమగును; ఒకదేశమును మరియొకదేశముతో నొక సరకుయొక్క ఉత్పత్తియందు, ప్రతికూలస్థితిలో పోటీని కల్పించును. నిరాటంక వాణిజ్యవిధానమునందు ఏదేశమేవస్తు ఉత్పత్తికి సహజ సామర్థ్యముగల్గియున్నదో, ఆదేశముతో, ఆ వస్తూత్పత్తియందు మఱి యితరదేశమేదియు పోటీచేయదు. టస్కనీదేశము ఇంగ్లాండుతో ఉక్కుపరిశ్రమయందు పోటీచేయలేదు. ఇంగ్లాండు టస్కనీతో నూనెపరిశ్రమయందు పోటీచేయలేదు. ఆ రెండుదేశములును, ఉక్కు నూనెను మారకముచేసికొనవలసియుండును. అట్టిమారకము, స్పష్టముగ, స్వేచ్ఛగ, న్యాయముగ జరుగును. సముద్రపుగాలి ఎంతవరకు అనుకూలించునో అంతవరకు జరుగును. మొదట కొద్ది పోటీయుండవచ్చును. ఆదేశములు పరస్పరముగ నేది ఏవస్తు పరిశ్రమలో నుత్తీర్ణమైనది అనువిషయము నిర్ధారణగువరకు కొద్దిగపోటీ సాగును. అట్లు ఒకసారి నిర్ధారణయిన వెనుక పోటీ దానంతటదే అంతరించును.

బీదలను ప్రత్యక్షముగ పీడించుచున్నదని తోలగింపబడలేదు. వారికృషియందు చాలభాగము యుత్పత్తికి ఉపకరింపక వ్యర్థపరచుచు వారిని పరోక్షముగ పీడించుచున్నదనియే తొలగింపబడెను.

అదేవిధముగ అనవసరమగు సుంకపువిధానము మూలధనమును నాశనముజేయును; ప్రజలను పీడించును. కాని పేదలగతిమాత్రము ప్రప్రథమముగ నుచితమైన కూలిని గూర్చిన సమస్యపై నిరంతర మాధారపడి యుండును. సోమరితనమువలన, చిన్నదోషములవలన, నేరమువలనగల్గు యనర్థముతో సంబంధములేకుండగనే ఒకవైపునపోటీ, రెండవవైపున దురంతమగు పీడింపు ఈరెండింటి ఘటనాఘటనమున వారిదుస్థితి యద్భుతముగ నుపద్రవించును.

ప్రపంచమున నింతవఱకు ఎన్నడును నిజముగ నతీతమగు జనసంఖ్యయుండలేదు;ఇకముందనేకయుగములవఱకునుండదు. కాని ఒకచోట స్థానికముగ నధికజనసంఖ్యాసమస్య పొడచూపవచ్చును. అక్కడ వలసినదూరదృష్టి, యంత్రసాధనములును లేకపోవచ్చును. పోటీవలన ఒత్తిడిగల్గవచ్చును. అందువలన నచటి జనసంఖ్య నవశ్యముగ నిగ్రహించుకొనజాలని పరిస్థితు లేర్పడవచ్చును. అప్పుడు జనసంఖ్య యధికముగనున్నట్లు తోచవచ్చు. ఈ పోటీవలనగల్గు నవకాశము నుపయోగించుకొని ఒకడన్యాయముగ నచటికార్మికుల కృషిని యతిచౌకగ బడయుచు, తనకు, కార్మికులకుగూడ దుస్థితికల్పించును. ఏలయన, ప్రతివిధమైన బానిసత్వమునను గూడ పీడింపబడువారి

కన్న పీడింపఁబడువారు తుట్టతుదకు అధిక బాధ నొందుదురు. పోపు కవి నుడివిన ఈ భావగర్భితమగు గంభీరపాదము లందలి సంపూర్ణ సారాంశము గూడ సత్యమునకు కొంతతక్కువనే సూచించును.

"పాపము! ఈధనవంతులగూర్చిన న్యాయము చెప్ప వలెనన్న ప్రతివాడును తన పొరుగువానిని తన్నువలెనే అసహ్యించుకొనును. గనులను త్రవ్వువానిని, అందుదాగెడు వానిని, ఇరువురును గనులపాల్పడి, వారిరువురకు నొకేగతి వాటిల్లును".

ఈవిషయమున న్యాయముయొక్క తుదికార్యమును, పరోక్షకృత్యమునుగూర్చి పరిశీలింతము. విలువయొక్క నైజమునుగూర్చిన నిర్వచనము తొలుత యవసరము. అందుండి సాధారణవ్యవహారానుగుణమగునట్టి యింతకంటె న్యాయమగునట్టి యార్థికపద్ధతినెట్లు నెలకొల్పనగునో యోచింతము. తుదకు, నిరుద్యోగులగు* కార్మికులదుర్గతినిగూర్చిన

---

* పనిసంపాదించుట, పనికి తగిన వేతనము గొనుట - ఈరెండింటి నేది కష్టతరమో చదువరులే నిర్ణయింతురుగాక. ప్రపంచమున వృత్తిపని పాట్లు చాలకొద్దిగ గలవు. కనుక ఒకవృత్తిని చాల విలువైన భోగ సాధనముగ నెంచవలయునా? దానిని సంపాదించుట కష్టతరమనవలయునా? శరీరవ్యాయామ క్రీడావినోదమునకై కొందరిని పోషించవలసియుండును గదా! అట్లు వారిని మనము పోషించుటలేదా? ఈవిషయము విపులీకరించ వలసియున్నది. ఏలయన, చాలమంది "ఉద్యోగము దొరకుట చాల కష్ట తరము అని చెప్పునలవాటు గలదు. మనకు కావలసినది "ఉద్యోగమా"? లేక ఆఉద్యోగము చేయుకాలమున మన "పోషణాధారమా?" మనము తుదముట్టించవలసినది "సోమరితనమా?" లేక "ఆకలియా?" ఈరెండు

నిరంతరము వేధించు సమస్యను పరిశీలింతము. ఈపరిశీలనము నందు దో చెడుకొన్ని నిర్ణయములు చదువరులకు వెలువు గల్గించవచ్చును. ధనప్రభావమునకు నిరోధకముగనుండి, సాంఘిక సామ్యవాదముతో సరిపడుచున్నవనిగూడ నెంచ వచ్చును, కనుక నేనుచెప్పదలచిన ఒకటి రెండు ముఖ్యాంశ ములను, వారు తెలిసికొనుటకుగాను రూఢిగ నిచట చెప్పెదను.

సైన్యమున, నౌకాశాఖయందును నేనుచెప్పిన సూత్ర ములప్రకారము వేతనములొసంగబడును. ఉత్పత్తికేంద్రము లందు కార్మికులకు నాప్రతిపక్షులు చెప్పిన సూత్రములప్రకా రము వేతనములొసంగబడును. ఈరెండింట దేనిలో సాంఘిక

---

ప్రశ్నల నొకేసారి యోచించుటకంటె నొకదానివెనుక నొకటి యోచింతము. పనిఅన్నది నిస్సంశయముగ భోగ్యసాధనమే. చాల గొప్ప సాధనముకూడ. అది అనుభోగ్యము అగత్యముకూడ అగును. ఏమానవుడును పనిలేకుండ తనమనసునుగాని శరీరమునుగాని ఆరోగ్యముగ నుంచుకొన జాలడు. ఈవిషయమును నేను దృఢముగ నమ్ముచున్నాను. దయామయు లును, వ్యావహారికులునుగూడ, ధనవంతుల కీవిషయము తెలిపి, వారికి 'పని' అనునది ఒక భోగ్యసాధనమని చెప్పి వారిని ప్రస్తుతము తామొనర్చు పనికంటె నధికమగు పనిని నిర్వహింప ప్రోత్సహించుట మంచిది. ఐతే, ఇట్టి అధికఆరోగ్యకారియగు నానందమును కొందరు అత్యధికముగ పొందు చుండుట మన యనుభవసిద్ధము. మానవులందు మిక్కుటముగ తినుట ఎంతసహజమో, మిక్కుటముగ పనిజేయుటగూడ అట్లే సామాన్యము. కనుక నీవిషయమున ఉదారమగు సంస్కరణమేమన, కొందరికి మితమగు భుక్తి ఎక్కువపనిని ఒసగుట అవసరము, మరికొందరికి తక్కువపని ఎక్కువభుక్తి యొసగుట అవసరము.

సామ్యతత్త్వము అధికముగ పురోభివృద్ధినొందెనో నాప్రతి పక్షుల నిర్ణయమునకు విడుతును. వారే చెప్పుదురుగాక. వారి తుదినిర్ణయ మేమైనను గానిండు; నేనుమాత్రమొక ప్రశ్నకు సమాధాన మొసగవలసియున్నది. ఏమన, నా రచనలన్నిటిలో నితరవిషయములన్నిటికంటె సదానిర్ధారణముగ చెప్పినవిషయ మేదైనయొకటియుండెనా, అదియే సామ్యతయొక్క యసాధ్యమునుగూర్చిన విషయము.

మానవులందు సదాకొందరు ఇతరులకంటె, ఒకొక్కప్పుడు ఒక్కడే యితరులందరికంటెను, ఔన్నత్యమును గల్గి యుండుటనిత్యమని నిరూపించుటయే నానిరంతరలక్ష్యము. మరియు నట్టియౌన్నత్యము గలవారినే వారి యధికజ్ఞానమువలనను వివేకమువలనను తమకంటె తక్కువగువారికి మార్గదర్శకులుగను, నాయకులుగను, ఒకొక్కప్పుడు వారిని నిర్బంధించి లోగొనుటకునుగూడ నియమించుట యుచితమని నిరూపింపనెంతును. నాయర్థశాస్త్ర సూత్రములన్నియును మూడేండ్లక్రితము మాంచెష్టరులో నేనుజెప్పిన "నాగలియోధులును, ఖడ్గయోధులవలెనే" యనువాక్యమున నిమిడియున్నవి. వాటినన్నిటిని గూడ "ఆధునిక చిత్రకారులు" అను నాగ్రంథమున ఒకవాక్యములో పొందుపరచి చెప్పితిని.

"ప్రభుత్వము, సహకారము, యివి అన్నివిషయముల జీవిత నిబంధనలు ;

అరాజకము, పోటీ – యివి మృత్యునిబంధనలు".

ఇక నీ సాధారణసూత్రములు ఆస్తిభద్రతకువర్తించు విధానమును జూచెదము. ఆస్తిభద్రత యుండరాదని నాయభిప్రాయము గాదు. ఈశ్లిష్టకలసారాంశమా భద్రతను (ఇనుమడింప) విస్తరింపజేయులక్ష్యమేయని గ్రహించనగును. అయితే బీదవారికి ధనవంతులయాస్తిపై హక్కులేదని చాలకాలము తెలియజెప్పిరి; ధనవంతులకును బీదవారిసొత్తుపై హక్కులేదని గూడ నేనిపుడు చెప్పనెంచితిని.

కాని నేను విపులీకరింపబూనిన ఆర్థికపద్ధతిని అమలు జరిపిన, అది యానందమొనగూర్చు దేవతగ పరిణమించునట్టి ధనప్రభావమును, సకలకృషికిని నధిపతిగ పరిణమించునట్టి మూలధనప్రభావమును, అనేకరీతుల తగ్గించును. అగోచరమైనట్టి, సమాయత్తమైనట్టి ప్రభావమును గాకపోయినను స్పష్టముగదో చెడు ప్రత్యక్షభావమునైన ననేకవిధముల సంకుచితపరచునన్న విషయమును నేను కాదనను ; అంతేకాదు; నేనతి ఆనందముగ సమర్థింతును. మానవబుద్ధికి ధనాకర్షణమిప్పటికే చాల బలవత్తరమైయున్నదనియు, ధనాధికారము చాల యుద్దండముగనున్నదనియు గూడ తెలియును.

ఆర్థికవిధానపు సామాన్యసిద్ధాంతములగు ఒకశాస్త్రముగ మనమంగీకరింతుము. మానవ బుద్ధిబలమున కింతకంటె సిగ్గుచేటైనదేదియు చరిత్రమునలేదని నేను ముందువ్యాసముననే చెప్పితిని. అట్లు చెప్పుటకనేక కారణములు గలవు; గాని అందుముఖ్యమగువాటిలో నొకటిమాత్రమీ కొద్దిమాటలలో చెప్పెదను.

ఒకదేశ మవలంబించు మతమందలి ప్రథమ సిద్ధాంతములనే నవశ్యముగ నుల్లంఘించునట్టి పద్ధతిని నెలకొల్పుట, చరిత్రలో ముందెన్నడును జరిగినట్లు నే నెఱుగను. మనము దివ్యగ్రంథములను నోటకొనియాడుచు చాల పవిత్రముగ జూతుము. అవి ధనకాంక్ష సర్వనాశనకారణమనియు, ధనారాధనము దేవుని కసహ్యాకరమైనదనియు, దృఢముగ ఖండించును. అంతేగాక, ధనదేవతారాధనము ఈశ్వరారాధనమునకు సరియైన నకార్యకారియనియు జెప్పును. మరియు నవియకుంఠితమగు నైశ్వర్యమునుగూర్చి చెప్పునపుడెల్ల ధనికులకు దుఃఖప్రాప్తియనియు, అకుంఠితమగు దారిద్ర్యమునుగూర్చి చెప్పునపుడెల్ల పేదలకు సర్వశ్రేయఃప్రాప్తియనియు చెప్పును, ఆవెంటనే, దేశసౌభాగ్యమునకు దగ్గఱమార్గముగ నెంచి, మనము ధనవంతులమగుటకు సాధనమగు శాస్త్రము నకై పరిశోధన చేయుదుము.

"ఇట్టి క్రైస్తవులనే యవిజ్ఞానులగు నితిరోపియనులు నిందింతురు;

మానవులందరిని రెండుపక్షములుగ, నిత్యైశ్వర్యవంతులుగను, నిత్యదరిద్రులుగను విభజించునపుడు, ఈక్రైస్తవులు రెండవపక్షమునకు చెందియుందురు."

---

# విలువ

పూర్వవ్యాసమున, కార్మికునిశ్రమకు న్యాయమగు వేతన మనగా, ఆశ్రమకు సుమారుగ సమానమగు శ్రమయొక్క ఫలిత మాకార్మికుడు భావికాలమున పొందగల్గునంతటి ద్రవ్యము అని తెలిసికొంటిమి. ఆ సమానమగు శ్రమఫలితము చేకూరుసాధనముల పరిశీలించవలసియున్నది. అందుకు విలువ, భాగ్యము, ధర, యుత్పత్తిఅను పదముల నిర్వచనముల తెలిసికొనవలసి యున్నది.

ఈ పదములలో ఏదిగూడ ప్రజలకర్థమగునట్లింతవరకు నిర్వచింపబడలేదు. కాని కడపటిది, యుత్పత్తియనునది యన్నింట బహుస్పష్టమైనదని మనమనుకొనవచ్చును; కాని వాడుకలో నది చాలద్వంద్వార్థముగనున్నది. ఆ ద్వంద్వభావ పరిశీలనమే మననిర్వచనమునకు బాగుగ దారిచూపును.

పెట్టుబడి లేక మదుపునుగూర్చిన యధ్యాయములో, జె. యస్. మిల్ అను గ్రంథకర్త యిట్లువ్రాసెను. "ఇనుప సామగ్రి నుత్పత్తిచేయువాడొకడు తన వ్యాపారమందలి రాబడిలో కొంతభాగముతో కొన్ని వెండిపళ్లెరములను, నగలను కొనదలచి, తరువాత తనమనసు మార్చుకొని, మరికొందరుపనివాండ్ర కూలికిక్రింద నాసొమ్మునువినియోగించిన, నతనిని పెట్టుబడిదారుడు లేక మదుపుదారుడు అందు"రని వ్రాసెను. అందుచే నుత్పత్తికితోడ్పడు కార్మికులకై మఱికొంత యాహారమును వినియోగించినట్లగునని ఆయనచెప్పెను.

ఈ వాక్యములు నేను వ్రాసినచో "వెండివస్తువులు తయారుచేయువారిమాట యేమి?" అని నన్నడిగియుందురు. అయినను, నేనుమాత్రి మట్లడుగను. ఆ వెండిపనివాండ్రు నిజమగు నుత్పత్తిదారులుకానిచో, వారినాశనమునకు మనము తప్పక యనుమతింతుము. ఇంకను, మరియొకభాగమున, నా గ్రంథకర్తవ్రాయుచు, ఆ యినుపవర్తకుడు తన నౌకర్లలో కూడ కొందరినితగ్గించిన, అట్లు తగ్గించుటవలన, "మఱికొంత యాహారముత్పత్తికొఱకు చేకూరును" అని చెప్పెను. అట్లు తొలగింపబడిన నౌకర్లతిండి పోగొట్టుటకష్టముగాని,మఱియేమి గాని, పర్యవసానమునుగూర్చి యడుగను.

కాని యినుపసామగ్రి యేల యుత్పత్తియగును? వెండి సామగ్రి యేలకాదు? అని మాత్రిమడుగుదును. ఒకటి తా నుపయోగించును, రెండవది తానమ్మును అనునది మాత్రిమే వాటిలో భేదము కాజాలదు. వస్తువులనుత్పత్తిచేయుట అమ్మటకేగాని వినియోగించుటకు కాదనిన, ఆభేదము నంగీ కరించవచ్చును. ఐతే, ప్రస్తుతము వర్తకులనుదినము గూడ వస్తువులనుత్పత్తిచేయుట అమ్మటకేగాని వినియోగిం చుటకు కాదనిగూడ చూప యత్నించుచున్నారు.అదిఅట్లుండ, ఈ విషయమున, యినుపసామగ్రియెడ వర్తకుడు కేవలమొక చోటినుండి మరియొకచోటునకు గొనిపోయి వినియోగ దారుల కందజేయు మధ్యవర్తియగును. వెండిసామగ్రిపట్ల తానే వినియోగదారుడగును. కార్మికులు మాత్రిము ఉభయ

విషయముల సమానముగ విలువగు సామగ్రినుత్పత్తిచేయు టచే, రెండింటవారు సమానముగ నుత్పత్తిదారులగుదురు.

మరి వారినేవిధముగ విచక్షించవలెను? నైతిక దృష్టితో అర్థశాస్త్రమున కేమియు సంబంధములేదని మిల్ యభిప్రాయము. ఐతే, నైతికవేత్త యభిప్రాయములో ఒకఉక్కుగరిటె ఒక వెండిగరిటెకంటె నెక్కువ యుపయుక్తమగు నుత్పత్తియని ఎంచవచ్చును. అట్లే చిన్నకత్తులును గరిటెలవలె మంచియుత్పత్తిగా పరిగణింపవచ్చును. కొడవళ్లు, నాగలికొళ్ళుగూడ నుపయుక్తమగు వస్తువులే.

కాని, బాకుకత్తుల నెట్లు పరిగణింపవలెను? ఆయినుపవర్తకుడు వ్యాపారాభివృద్ధికై, తన నౌకర్లను వెండిపని వాండ్రనుగూడ తొలగించి, వారిభుక్తినికూడదీసి వారికి బదులు, మిల్ చెప్పినట్లు "స్థిరానుభవసాధనమగు సరకులగు" ఏ బాకుకత్తుల తయారుచేయుటకధికముగ కార్మికుల నియమించుననుకొందము. లేక, ఈ బాకుకత్తులకు బదులు బాంబుల తయారుచేయించుననుకొందము. ఇవి మఱింత విలువైనవి శక్తివంతమగు యుత్పత్తివస్తువులుకదా! ఐతే వాటి 'యనుభవానందములు" వాటిని యుత్పత్తి చేయు స్థల, కాలముల నిర్ణయముపై నాధారపడియుండదా? నిర్ణయమనగా, యర్థశాస్త్రమునకు సంబంధములేని యాధ్యాత్మిక మీమాంసానుసారముగ నిర్ణయింపవలదా?

మిల్ రచనయందలి విరుద్ధములే యందలియమూల్యత. కాకున్న, నాతనిరచనయందీ విరుద్ధముల చూపించుటకు చాల

విచారించియుండును. అతడు చెప్పిన సూత్రములను తానను కొనకుండగనే నిరాకరించుచు, తినయార్థిక శాస్త్రముతో ఏ నైతికమీమాంసకును సంబంధములేదనుచు ఆనైతికపరిశం సనే ప్రవేశపెట్టును. అందువలననే నాతడర్థశాస్త్రజ్ఞులందు గౌరవపాత్రుడాయెను. అతనిరచనయం దనేక భాగములు చాలయమూల్యమైనవి. యథార్థములు. అతని దత్తాంశముల నుండి యతడు చేసిన తుదినిర్ణయములే నా మీమాంస విషయములు.

ఇప్పుడు మనముపరీక్షింపు విషయముయొక్క మూల మేమన, యుపయుక్తమగు వస్తువుల తయారుచేయుటకు కావ లసినంతమందికంటె వినోదకరమగు వస్తువులయుత్పత్తికి కావ లసినవారి సంఖ్య తక్కువగనుండును. ఇదికదా సంపూర్ణ సత్యము. ఐతే పై యుదాహరణము సరిపోదు. సర్వవిధ ముల నసంభవము. ఏలయన, మిల్ "ఉపయుక్తము"యొక్క నిజార్థము నిర్వచింపలేదు.

"ఉపయుక్త"మనగా "ఒకకోర్కెతీర్చుటకు లేక ఒక పని నిర్వహించుటకుగల సామర్థ్యము" అని యతడు నిర్వచిం చెను. ఇది యినుము, వెండి రెండింటికిసమానముగ వర్తిం చును. ఐతే నిజమైన నిర్వచనము, నాతడుచెప్పనిది, వేరొకచోట నాతడు పైకిచెప్పినమాటల వెనుక నాతడనుకొన కుండగనే నాతనిమనసునుండి జారెను. ఉపయుక్తమనగా "జీవితమునకు లేక పుష్టికి నాధార"మైనదని నిర్వచించెను. ఈ నిర్వచనము కొన్ని యినుపవస్తువులకేగాని మిగిలినవాటి

కన్వయించదు. కొన్ని వెండివస్తులకేగాని మిగిలినవాటి కన్వయించదు. నాగళ్లకన్వయించునుగాని, బాకు కత్తులకు వర్తించదు; పళ్ళగరిటెల కన్వయించునుగాని, జిలిబిలియాభరణములకు వర్తించదు. ఈ నిజమైననిర్వచనము, మనతొలిప్రశ్న "విలువయన నేమి ?" అనుదానికి సమాధానమిచ్చును ఇందుకు సామాన్యాభిప్రాయముల నొుదట గమనింతము.

"విలువ"యను పదము నిర్విశేషణముగ వాడునపుడు దానియర్థము యర్థశాస్త్రమున "మారకపు విలువ" యని చెప్పుదురు. అనగా, రెండుయోడల చుక్కానుల నొక దానితో మఱియొకటి మార్చుటకు వీలులేనిచో, ఆచుక్కానులా రెండుయోడలలో దేనికిని విలువలేనివని సామాన్యయార్థికభాషయందలి యర్థము.

కాని "యర్థశాస్త్రమందలి విషయము భాగ్యమ"ని చెప్పబడెను.

ఇక భాగ్యమన "సకలయుపయుక్తమైన, సమ్మోదమైనట్టి మారకపువిలువ గలిగిన యన్నివస్తువుల"గును.

మిల్ అభిప్రాయములో 'యుపయుక్తము' 'సమ్మోతము' అనునవి మారకపు విలువయందిమిడి యున్నట్లు దోచును. ఒకవస్తువును విలువగుదానిగ గ్రహించుటకు ముందు అందీరెండులక్షణములుండుటను నిర్ణయింపవలెను.

ఒకవస్తువుయొక్క ఆర్థికోపయోగము, కేవలము దాని సహజలక్షణముపైననేగాక, దానినుపయోగించగలట్టి

ఉపయోగించువట్టి జనులసంఖ్యపై నాధారపడియుండును. ఎవడును స్వారిచేయగలవాడు లేనిచో నొకగుఱ్ఱము నిరుపయోగము, కనుక అమ్మజాలము. అట్లే ఎవరును వాడగల్గినవాడు లేకున్న ఖడ్గము నిరుపయోగము, తినలేనివాడున్న మాంసము నిరుపయోగము. ప్రతివస్తువుయొక్క యుపయుక్తత దానినుపయోగించుటకుగల మానవసామర్థ్యముపై నాధారపడియుండును.

అట్లే సమ్మతముగూడ ఒకవస్తువుయొక్క సహజలక్షణముపైననేగాక దానియెడ నిష్టముచూపెడువారి సంఖ్యపై నాధారపడియుండును. సమ్మోదము, లేక విక్రయింపబడుటగూడ నిట్టి మానవసమ్మోదముపై నాధారపడియుండును. తాగుబోతునకు సురాభాండముపైగల యిష్టము ఒక మహాచిత్రువుపైనుండదు. అనగా, ఒకవస్తువుయెడ సమ్మతము మానవస్వభావముపై నాధారపడియుండును. కనుక భాగ్యమునుగూర్చిన యర్థశాస్త్రము మానవసామర్థ్య స్వభావములగూర్చిన శాస్త్రమై యుండవలెనుగాని నైతిక విచారణలతో యర్థశాస్త్రమునకు ప్రమేయములేదందురు. అందువలన, నైతికవిచారణలకు మానవశక్తి స్వభావములతో ప్రమేయములేదు.

ఈ విధమగు మిల్ రచనయందలి తుదినిర్ణయములతో గూడిన దృక్పథమెంత సమంజసమైనదో విశదమే. నేనెంత మాత్రమంగీకరించ జాలను. ఇక రికార్డో యనునాతని సూత్రముల పరిశీలింతము.

"ఉపయుక్తత మారకపువిలువకు ముఖ్యముగ నవసరమైనను, దాని పరిణామమును తెల్పునదిమాత్రము కాజాలదు" అని చెప్పెను. అవసరమెంతవఱకు? ఉపయుక్తతయందెక్కువ తక్కువలుండవచ్చు గదా. మాంసము ప్రతివారును భుజించునంత బాగుగనుండవచ్చును. లేదా, ఎవరునుతినుటకు వీలులేనంత చెడ్డగనుండవచ్చును, మారకపువిలువ గలిగియుండుటకా మాంసమెంత బాగుగ నుండవలెను. అట్టి విలువలేకుండుటకెంతచెడ్డగ నుండవలెను. (మనబజారులందీ సమస్య పరిష్కరింపబడిన చాల బాగుండెడిది.)

రికార్డో సూత్రములందు గూడ నొకచిక్కు దోచును. ఆయనతీసుకొనిన యుదాహరణమే చూతము.

"మానవసంఘముయొక్క ప్రాచీనావస్థలో వేటకాని విల్లు, అమ్ములు, జాలరివాని వేటపరికరములతో సమాన విలువకలిగి యుండెననుకొందము. ఒకదినమున వేటకాడు వేటాడిన లేడి, జాలరిపట్టిన చేపలవిలువకు సమానమగును. ఉభయులవేట ఫలితముల తారతమ్యపువిలువవారి వేటలయందుగల శ్రమానుసారము నిర్ణయింపబడును" అని చెప్పెను.

అట్లయిన, జాలరి ఒక్క చేపనేపట్టిన, వేటకాడు ఒక్క లేడినే వేటాడిన, ఒకచేప ఒకలేడివిలువకు సమానము. మఱియు జాలరి ఒకచేపనుగూడ పట్టలేక శూన్యహస్తుడైన, వేటకాడు రెండులేళ్లను వేటాడిన, రెండులేళ్లవిలువ శూన్యమగునా?

కాదు; కాని రికార్డోను సమర్థించువారు, అతని యభిప్రాయములో సగటున సమానమగునని అందురు. అనగా

వేటకాడు సగటున దినమునకు ఒక లేడిని వేటాడిన, జాలరి సగటున దినమునకు ఒకచేపనుపట్టిన, ఆయొక్క చేప, ఆఒక్క లేడికి ఎప్పుడును విలువయందు సమానమగునని భావము. ఐతే, ఆ చేపజాతియేమి? అని అడుగుదమా? ఒక పెద్ద తిమింగిలమా? లేక చిన్న చేపా?

ఈమిథ్యా హేతువిచారణమువలన కాలహరణమగును గనుక, నిజమగు నిర్వచనమును తెలిసికొందము.

అనేకశతాబ్దములుగ మన సాంప్రదాయమగు విద్యావిధానము చాల శ్లాఘించబడినది. విద్యావంతులగు వర్తకులు వారభ్యసించిన లేటిను భాషాజ్ఞానమును జ్ఞప్తికి తెచ్చుకొనిన బాగుండును. అందు "విలువ" యను పదముయొక్క వ్యుత్పత్త్యర్థము 'బాగాయుండుట' అనగా మనుజుడైన శక్తి పరాక్రమములు గల్గియుండుట వస్తువైన జీవితమునకు పుష్టినిచ్చునట్టిదియు యని మూలార్థము. కనుక విలువైనది యనగా 'జీవితోపయుక్తమైనది' అని భావము. నిజముగ విలువైన వస్తువు సంపూర్ణమగు పుష్టిగల జీవసాధనమని చెప్పవలెను. జీవసాధనమెంతవఱకు కాజాలదో లేక నెంత బలక్షీణకారణమో అంతతక్కువ విలువైనదగును. జీవభంగకరమైనది విలువహీనమై హానికరముగనుండును.

కనుక, ఒకవస్తువుయొక్క విలువ దానిపరిమాణముతోగాని, దానిపైనుండు యభిప్రాయముతోగాని, నిమిత్తములేకయుండును. దానినిగూర్చి నీయిష్టమువచ్చినట్లు తలంచుము, ఏలాభమునైన పొందుము; దానివిలువ మాత్రము హెచ్చు

గాదు, తక్కువగాదు. అది యెప్పుడును పనికివచ్చును, లేక నెన్నటికిని పనికిరాదు. సృష్టికర్త దానికి ప్రసాదించిన శక్తి నీయభిప్రాయమును వృద్ధిచేయలేదు; నీనిరసనము క్షీణింపచేయ లేదు.

వైద్యశాస్త్రమును చిలిపి చిల్లంగినుండి, నక్షత్ర శాస్త్రమును జ్యోతిషమునుండి విచక్షించువిధమున, నిజమగు నర్థశాస్త్రములు, సంకరజనితమగు నార్థికవిధానమునుండి విచక్షించవలెను. అట్టి నిజమైన యర్థశాస్త్రము దేశములకు జీవితపరిమోదమునే కోరుటనుగూర్చి, అందుకుకావలసిన వస్తువులకై కృషిచేయుటనుగూర్చి బోధించును. జీవితనాశన కారణమగు వస్తువులద్వేషించుట, వాటిని ధ్వంసముజేయుటనుగూడ బోధించును.

మఱియు, దేశములు వాట్శైశవజ్ఞానమున, కొఱగాని నత్తగుల్లలను, ఎఱ్ఱని నీలపురంగు జాతిముక్కల నమూల్యమగు వాటిగ నెంచి, వాటికొఱకై జీవితౌన్నత్యాభివృద్ధులకు వినియోగింపనగు శ్రమ నధికముగ నీటముసుగుటకో, లేక గనుల త్రవ్వుటకో లేక వింతయాకారములుగల ఱాళ్ళను చెక్కుటకో యుపయోగించును. లేదా, అదే శైశవజ్ఞానముతో గాలి, వెలుగు, పరిశుభ్రత మొదలగు నమూల్యమగు క్షేమదాయకమగు వాటిని విలువలేనివిగ భావించును. లేదా తమ జీవిత విధానముననే సర్వము సేకరించి యనుభవింపగలమని తలంచుచు, శాంతి, భద్రత, ప్రేమ మొదలగువాటినిగూడ ననువైనపుడు బంగారము, ఇనుము లేక గుళకరాళ్ళు మొదలగు

వానితో సంపాదింపనగునని తలంచును. అట్టితఱి నీ యుత్కృష్టమగు నార్థికశాస్త్రమొకటే, వారికావిషయముల నన్నిట ఆడంబరమేదో భాగ్యమేదో బోధించును. మృత్యుసేవ, శుష్కారాధన నిత్యశూన్యతలనుండి, వివేకారాధన, రక్షణదేవతాసేవ, నిత్యసంపూర్ణతలను విచక్షణజేయుట గూర్చి తెల్పును. "నన్ను ప్రేమించువారు భాగ్యమును పొందునట్లు జేయుదును; వారిసంచితమును పూరింతును" అను నార్యోక్తిని తెలియజేయును,

'రక్షణదేవత' యనగా సామాన్య రక్షణగౌరవము కన్న గంభీరభావమున నూహింపనగును. ఆరోగ్యదేవత యనునది సామాన్యముగ భాగ్యముతో భిన్నముగ నెంచెదరు. కాని యథార్థముగ నది భాగ్యములో నొక భాగము. ఇక 'భాగ్యము' యొక్క నిర్వచనమునుజూతము.

"భాగ్యవంతము అనగా నుపయోగమైన వస్తువులను చాల కలిగియుండుట" అని మిల్ చెప్పెను, ఈ నిర్వచన మొప్పుకొందును, కాని అది మనము పూర్తిగ నర్థముచేసికొనవలెను. నాప్రతిపక్షులు నేను తగురీతిని తర్కించనని విచారింతురు. వారికిష్టమగు నంతకంటె నధికమగు తర్కమీయవలసియుండునని భీతిల్లుచున్నాను. కాని—యర్థశాస్త్రవ్యాపారమంత సుఖమైనదికాదు. మనపదప్రయోగమున అశ్రద్ధకూడదు.

అందువలన, పైనిర్వచనమునందలి 'కలిగియుండుట' అనుదానియర్థము మొదట నిర్ణయింపవలెను. అనగా కలిగి

యుండుటయొక్క స్వభావమును, పిదప 'నుపయోగము' యొక్క అర్థమునుకాని ప్రయోజనముయొక్క స్వభావమును గాని నిర్ణయింపవలెను.

'కలిగియుండుట' అనుదానిగూర్చి యోచింతము. మిలాన్ గుడియొద్ద రెండుమార్గములు కలియుచోట గత మూడు వందలయేండ్లుగా సేంట్, కార్లోబొరోమియో యనునతని కళేబరము సుగంధద్రవ్యములచే పూయబడి సమాధిజేయబడి యున్నది. దానిపై నొక బంగారుదండము, వక్షమున నొక రత్నఖచితమైన శిలువయుపయోగమగు వస్తువులని యంగీకరించిన, అకళేబరము వాటిని కల్గియున్నట్లు భావించనగునా ? ఆర్థికశాస్త్రమున ఆస్తియను పదముయొక్క అర్థమననుసరించి, అవి ఆశరీరమునకు చెందునా? మృతకళేబర మాస్తి కల్గియుండనేరదని నిశ్చయించి, అవి దానికిచెందవని యందము. ఐతే, ఆ స్తికల్గియుండుట సాధ్యమగుటకు శరీరమందెంత చేతనాశక్తి ఎంతకాలముండవలెను ?

ఇంకొకటి యోచింతము. ఇటీవల కాలిఫోర్నియానొక యొకటిమునిగెను. అందొక ప్రయాణికుడు తనమొలకు రెండు వందలపౌనుల బంగారముతో నొకపటకాకట్టుకొనెను. అతడు వానితో నీటిలోమునిగి యడుగుననుండెను. వాడు మునుగు నపుడు, వాడు బంగారమును కలిగియుండెనా? బంగారము వానిని కల్గియుండెనా ?

మఱియు, నాబంగారముయొక్క భారముచే నాతడు సముద్రములో మున్గుటకుబదులు, అది వానినుదుటతగిలి,

యేపక్షవాతమునో లేక యున్మత్తతవంటి యనివార్యవ్యాధినో కల్గించిన, యాతడాబంగారమును ముందటికంటె నెక్కువగ 'కల్గియుండుట'గునా ? ఆబంగారముపై నీరీతిగ క్రమముగ హెచ్చెడు జీవైకశక్తినిగూర్చిన నిట్టియుదాహరణము లనేక మీయవచ్చును. కాని యింతతో నీవిచారణముగింతును. ఇందు చదువరులు, 'కలిగియుండుట' యనునది నిరంకుశము గాక క్రమముగ వర్తించుశక్తియనియు, అది అట్లు కలిగియుండు వస్తువుయొక్క పరిమాణముపైనను, దాని సహజస్వభావము నందే గాక, దానినికల్గియున్న వానికది యనుగుణముగ నుండుటయందును, దానినుపయోగించు తన జీవైకశక్తియం దునుగూడ గలదనియు గమనింతురని తలంతును.

కనుక, భాగ్యముయొక్క విపులమైననిర్వచనము "ఉప యోగమగునట్టి, మనముపయోగింపగలట్టి వస్తువులను కల్గి యుండుట" యగును. ఇది చాలతీవ్రమైనమార్పు. ఏలయన, భాగ్యమనునది యూరక 'గలుగు'యను దానిపై నాధారపడి యుండుటకుబదులు 'కల'యను దానిపై నాధారపడియుండుట విశదము. పూర్వము రోమ్‌నగర క్రీడాస్థలములందు, జనుల యొక్క యుల్లాసముతో నందలి మల్లులమరణమునకు బొటన వ్రేళ్లెత్తి చంపించునట్టిభాగ్యము గల్గియుండుట కాదు. దేశ వినాశనభూతమగు నుపద్రవము నెదుర్కొని, దేశరక్షణకై ఆత్మార్పణముజేయగల మహావీరునిదే భాగ్యము. వస్తువుల జేకూర్చుటయే యని మనముఅనుకొన్నది, సామర్థ్యమును గూడ జేకూర్చుటయనవలసియున్నది.

'కల్గుట' యను క్రియాపదమున కిది చాలు. ఇక యందలి 'యుపయోగమైన' యను విశేషణముయొక్క యర్థమేమి?

ఈవిచారణము ముందు చెప్పినదానితో చాల సంబంధించియుండును. ఏలయన, కొందరిచేతులలో నుపయోగమైనది, మఱికొందరి చేతులలో నందుకు వ్యతిరేకముగ, నిరుపయోగముగగాని దురుపయోగముగగాని యుండవచ్చును. ఒకవస్తువుయొక్క ప్రయోజనముగాని దుష్ప్రయోజనముగాని, కేవల మావస్తువునందుమాత్రమేగాక, దానియందా లక్షణమును కల్పించుమనుజునిమీద నెక్కువగ నాధారపడియుండును. పూర్వము గ్రీకులు ద్రాక్షరసమును తమయిష్టదేవతా ప్రీత్యర్థము సద్వినియోగపరచుచు, మనోభావ వికాసమంది, "దేవుని, మానవునిగూడ సంతసపరిచెడిది" అనిరి. అనగా మానవుని యాధ్యాత్మిక భౌతికజీవనముల రెండింట నతనిశక్తిని పెంపొందించెడిది. కాని దానినే దుర్వినియోగము చేసిన మానవుని దైవాంశమునకునుకూడ హానిజేయును.

మానవశరీరముగూడ నట్లే సద్వినియోగమునకుగాని దుర్వినియోగమునకుగాని లోనగును. క్రమశిక్షణమొనగిన శాంతిసమరముల రెండింట దేశసేవకుపయోగపడును. క్రమశిక్షణములేక దుర్వినియోగపరచిన దేశమునకు విలువశూన్యమై, కేవలమేకాకిగ, స్వాభిలాషోద్యుక్తుడై, యభాగ్యజీవితమునకు నతిహీనస్థితికి పాల్పడును. అట్టిశరీరముగలవానినే గ్రీకులు "బుద్ధిహీనుడ"నియు "స్వార్థ" జీవియనియు, దేశమున కేవిధముగను. నుపయోగము లేనివాడన్న భావ

ముతో, పిలుచుచుండిరి. అందుండియే, సంపూర్ణ స్వార్థపరుని "బుద్ధిహీనుడు" అందురు.

కనుక, సారాంశమేమన, ఒకవస్తువు యుపయోగముగ నుండుటకు, అది స్వభావసిద్ధముగ ప్రయోజనయుక్తముగ నుండుటయేగాక, ప్రయోజకులచేతులలోగూడ నుండవలెను. సరిగ చెప్పవలెనన్న, ఉపయోగించు ప్రయోజకుల చేతిలోని విలువ యనదగును. కనుక, నర్థశాస్త్రమునుకూడ బెట్టుటనుగూర్చిన శాస్త్రముగ భావించిన, సామర్థ్యాసామర్థ్యముల రెండింటినికూడ బెట్టుటనుగూర్చిన శాస్త్రమగును. అంపకమునుగూర్చిన శాస్త్రముగ పరిగణించిన, కేవలము అంపకమునుగూర్చియేగాక, విచక్షణతోగూడిన అంపకవిధానమును గూర్చిన శాస్త్రమగును. అనగా, ప్రతివస్తువు ప్రతివానికనిగాక, సరియగువస్తువు సరియైనవాని కందజేయుట యని భావము. చాల కష్టతరమగు శాస్త్రము; గణితముకంటె కష్టమైనది.

కనుక, భాగ్యమనగా, "ప్రతిభాశాలురకడగల విలువైన వస్తువులనదగును. ఒకదేశముయొక్క ప్రతిభ నెంచవలెనన్న, వస్తువువిలువ ఆవస్తువుగలవాని ప్రజ్ఞ, ఈరెండు విషయములుగూడ గణించవలెను.

దీనినుండి మనము గ్రహించవలసినదేమన, సాధారణముగ భాగ్యవంతులని చెప్పబడువారు యథార్థముగ వారి ఇనుపపెట్టెలకు వేయు తాళపుకప్పలకంటె నధిక భాగ్యవంతులు గారు. అట్టివారు స్వతస్సిద్ధముగ శాశ్వతముగ భాగ్యవంత

మునకసమర్థులు. ఆర్థికదృష్టిలో దేశముయెడ వారు నిశ్చలమగు నీటిగుంటలవలెను, ప్రవహించునీటిలో సుడిగుండము లట్లుందురు. నీరు ప్రవహించునంతసేపా సుడిగుండములు నిరుపయోగముగ నుండును, లేదా మనుష్యులను ముంచివేయుట కుపయోగించును. ఐతే, ప్రవాహము ఎండినపిదప నిశ్చలస్థితిలో కొంచెముపకరింపవచ్చును. మరియు, నట్టివారు ప్రవాహమున కడ్డముగ గట్టిన ఆనకట్టవలెనుండి, దాని తుదిఫలితమా కట్టడముపైగాక, నందువలన నుద్భవించు శక్తిని వినియోగించు యంత్రిగానిపై నాధారపడినట్లుందురు. లేదా, తాత్కాలికమగునట్లు, నాటంకములుగనుండి, భాగ్యదాయకముగగాక నభాగ్యకారణములై విరిసి యున్నవై పుల ధ్వంసము, దైన్యము ప్రబలజేయునట్లుండును. లేదా తుదకు, నేవిధముగగూడ వర్తింపక జీవచ్ఛవములుగనుండి, చచ్చిన గాని నెందుకునుపకరించు సాధనములేక, నడ్డంకులై, ఒక్కొకతరి దేశపు శీఘ్రపురోగమనకు తాత్కాలిక కాల హారణ సాధనములై యుండును.

ఇదియిట్లుండ, నిజమగు నర్థశాస్త్రమందలి కష్టము, కేవలము వస్తువుల విలువతో వ్యవహరించు పురుషత్వమును ప్రమోదించునగత్యముందేలేదు. ఏలయన, పురుషత్వము, వస్తువిలువ, ఈరెంటి సంయోగముననే భాగ్యమేర్పడినను, ఈ రెండును ఒకదానినిమఱియొకటి నాశముచేయునట్లువర్తించును. పురుషత్వము, వస్తువిలువ నుపేక్షించవచ్చును; నిరసనముతో

తోసిపుచ్చును; అందుకే అలెగ్జాండరుపోపు అనుకవి యిట్లు వ్రాసెను—

"నిజముగ పోగ జ్ఞనుబడయు లక్షణములలో చాల వరకు ఐశ్వర్యమును పెంపొందించుటకంటె నాశనము చేయుట కుద్యమించును."

మఱియు, ఇంకొకపక్షమున, వస్తువిలువ పురుషత్వమును క్షీణింపజేయును. కనుక నీవిషయమున, భాగ్యవంతుల మనస్సులపై భాగ్యముయొక్క ప్రకోపమునకు గల నిదర్శనముల పరీక్షించుట మనకర్తవ్యము. మరియు నెట్టివాడు భాగ్య సంపాదనమునకు బూనును; ఆపూనికయందు జయప్రదముగ భాగ్యమెట్లుసంపాదించును; ప్రపంచమందు నైతికప్రేరణమునకుగాని ముఖ్యసరకులకుగాని కనిపెట్టబడిన వాటికిగాని, ప్రచ్ఛన్నాభివృద్ధికిగాని, ధనికులకా పేదలకా ఎవరికి ఎక్కువకృతజ్ఞత జూపవలసియున్నది? యనునదిగూడ పరీక్షించవలసియున్నది.

ఎట్లయినను, ముందుజెప్పబోవు నిర్ణయముల కొంత వఱకు నిచటనుడివెదను. అవసర అంపకముల ననుసరించి వర్తించునట్టియు, బాహాటమగు హింసనుండి సంరక్షింపబడుచుండునట్టి ఒకసంఘమునందు సాధారణముగ శ్రామికులు, ధృఢమనస్కులు, గర్విష్ఠులు, లోభులు, సమయానుకూలవర్తనులు, క్రమవర్తనులు, పరిజ్ఞానులు, భావనాశూన్యులు, అభిమానశూన్యులు, అజ్ఞానులు, వీరు ధనవంతులగుదురు. ఇక పూర్ణవివేకులు, పూర్ణయవివేకులు, సోమరులు, నిర్లక్ష్య

పరులు, నమ్రవర్తనులు, ఆలోచనాపరులు, బుద్ధిహీనులు, భావసంపన్నులు, యభిమానపరులు, పండితులు, (యదృష్ట హీనులు), ఉద్రిక్తమగు క్రూరులు, హేయమగు ద్రోహి, బాహాటపు దొంగ, పూర్ణదయాళు, న్యాయశీలురు, ఆముష్మిక చింతనాపరులు, వీరు నిరంతర పేదరికమున నుందురు.

భాగ్యముగూర్చి ఇదిచాలు. ఇక 'ధర'యొక్క స్వభావమును పరిశీలింతము. అనగా. మారకపువిలువ, దానిని తెల్పు నాణెములగూర్చి యోచింతము.

మొదట గమనించవలసిన దేమన, మారకమునందు లాభముండజాలదు. కార్మికకృషియందే లాభముండవచ్చును. అనగా "ముందుగా పని నిర్వహించుట" లేక "నౌకరికై పని జేయుట" వీటియందే లాభముండవచ్చును. మారకమునం దనుకూలతమాత్రమే యుండును. అనగా, అట్లు మారకము జేయువారికి పరస్పరానుకూలతగాని, కొంతశక్తిగాని, చేకూర్చును.

ఎట్లన, ఒకడు చేనుదున్ని పండించుటచే నొక పడిధాన్యమును రెండుపడుల ధాన్యముజేయును. ఇదిలాభము. మరియొక డొక గనిలోత్రవ్వి, కరగించి పాటుబడుటవలన, ఒక పార నుపయోగించి రెండుపారలు జేయును. ఇదియులాభము. కాని రెండుకుంచముల ధాన్యముగలవాడు ఒకొక్కప్పుడు త్రవ్వజూచును; రెండుపారలుగలవాడు తినజూచును. వారు, ఒకరి లాభపుధాన్యమును మఱియొకనిలాభపు పనిముట్టుతో మార్చుకొందురు. అట్టి మారకమువలన వారిరువురకు శ్రేయము

చేకూరును. ఇరువురకు నావ్యాపారములో చాలయనుకూలత చేకూరినను, లాభముమాత్రము లేదు. ఈమారకమున నేదియు నుత్పత్తికాలేదు; దేనిని నిర్మింపలేదు. ముందు తయారయినదానిని, దాని యుపయోగముగలవాని కివ్వబడెను.

ఆ మారకము జరుపుటకు కార్మికకృషి యవసరమైన, ఆకృషి నిజముగ తోలుత వాటియుత్పత్తియందే కలదు. అన్నివిధములగు కార్మికశ్రమవలెనే అందులోగూడ లాభము గలదు. వస్తువుల తయారుచేయుటయందు, చేకూర్చుటయందు నెందరు కార్మికులుపనిచేసిరో వారందరికి నాభాగములో భాగముండును. ఐతే, అట్లు తయారుజేయుటగాని, చేకూర్చుటగాని మారకముగాదు; మారకమునందుమాత్రము లాభముండదు.

సంపాదనయనునది యుండవచ్చునుగాని యది వేరే విషయము. ఒకనికి స్వల్పమగుపనివలన చేకూరిన దానిని, మరియొకనికి అధికమగు పనివలన చేకూరినదానితో మారకము జేసిన, మొదటివాడు రెండవవాని యుత్పత్తిలో కొంతభాగమును "సంపాదించి"నట్లగును. అపుడు సరిగా ఒకడెంత సంపాదించునో రెండవవాడంత నష్టపోవును. వ్యాపారభాషలో నట్లు సంపాదించినవానిని "లాభము పొందెను" అందు. ఈ విధముగ ప్రతివాడు ఎట్లో లాభముపొందవచ్చునని మనవర్తకులు చాలమంది తలంతురు. కాని మనమునివసించు ఈప్రపంచపు దురదృష్టస్వభావమువలన జడపదార్థము, చలనమును

గూర్చిన నిబంధనలీవిధముగ సర్వసంపాదనమును దృఢముగ నిషేధించును.

లాభములేక భౌతికలాభమనునది నిర్మాణమువలన గాని క్రొత్తగా కనిపెట్టుటవలనగాని పొందనగును. మారకమువలన పొందవీలుపడదు. మారకమువలన నెప్పుడు లాభము చేకూరునో, యపుడెల్లను ఒకవైపునగల ప్రతి ధనరాశికిని సరియగు ఋణరాశి రెండవవైపున నుండును.

దురదృష్టవశమున, యర్థశాస్త్రపరిమోదమునకునోపు ఈవిధమగు ధనరాసులు ప్రపంచమున కడు నిశ్చితమగు గౌరవముతో నగుపడుటచేతనే ప్రతివారు నట్టి యద్భుతమగు ఫలితముల నొసంగు శాస్త్రముననుసరించుటకు కుతూహలపడుదురు. మఱియొకవైపున నాఋణరాసుల మొత్తములు, వెనుకవీధులకు జారిపోవుచు, చాటునకు విరమించును లేదా పూర్తిగా సమాధులజేరి యదృశ్యమగును. కనుకనే ఈశాస్త్ర గణితము వింతగ నగమ్యమై కష్టతరముగ నుండును. ఈఋణరాసులనేకము లొకవిధమగు నెట్టిసిరాలో లిఖించబడి, తిండి లేక కృశించి, పాలుబారి, ఒక్కొక్కతరి నదృశ్యమగును.

ఈవిధముగ మారకమునుగూర్చిన శాస్త్రమును లాభమునుగూర్చిన శాస్త్రముగ పరిగణించుట శుద్ధనిష్ఫలము. ఇక సంపాదనమునుగూర్చిన శాస్త్రముగనెంచితిమా, మనకు తెలిసిన ప్రతిశాస్త్రమూలములకుగూడ విరుద్ధముగనుండి ఒక వింతయగు శాస్త్రముగ దోచును.

ఎట్లన, ఒకయనాగరికునితో నేనొకసూదిని ఒక రత్నమునకు మారకము జేయగల్గితినా, అట్లు నాజేయగల సామర్థ్యము, యనాగరికుని యజ్ఞానముమీదనో, లేక, దేశ మందలి సాంఘికపరివర్తనముమీదనో, లేక ఆయనాగరికుడు మఱియొకనికి ఎక్కువసూదులకారత్నము నమ్మలేనట్టిశక్తి హీనతమీదనో, ఆధారపడియుండును. మఱియు, ఆ బేరము నాకు మరింతసానుకూలముగ నుండునట్లు, ఆయనాగరికునికి బెజ్జములేని సూదినిచ్చియుంటినా, మారకమత్యధిక సంతుష్టి కరముగనుండి, నాకావ్యాపారమందు చేకూరుసదుపాయము, అవతలవాని యజ్ఞానము, అసమర్థత,నిర్లక్ష్యములపై పూర్తిగ నాధారపడియుండునుకదా! ఇవిలేనిచో మారకమునందు సదుపాయము చేకూరుట సాధ్యముగాదు.

కనుక మారకమునందు ఒకనికి మరియొకనికంటె సదు పాయములభించుట రెండవవాని యజ్ఞానముపైనను, అసా మర్థ్యముపైనను ఆధారపడియుండునని చూచితిమి. అవి లేనిచో నాసదుపాయముగూడ నుండనేరదు. కనుక నా శాస్త్రము కేవలమజ్ఞానముపై నెలకొల్పినశాస్త్రము; కళా హీనతపై నెలకొల్పినకళ. ఇది తప్ప, మిగిలినసకలకళలు, శాస్త్రములుగూడ వాటి విరుద్ధములగు కళాహీనతను, అశా స్త్రీయములను నిర్మూలించుటయే లక్ష్యముగజూచును. కాని శాస్త్రములలో నెల్ల నీ శాస్త్రమే దానివిరుద్ధముల నన్నివిధ ముల ప్రోత్సహించును. లేనిచో ఈశాస్త్రమే యసంభవ మగును.

అందువలననే, వింతగ నిదియొక్కటియే అంధకార మునుగూర్చిన శాస్త్రము, బహుశః ఒక సంకరజనితమైన శాస్త్రము; దైవకల్పితమునగాక వేఱొకతండ్రికి జన్మించి యుండును. ఆతండ్రి తనబిడ్డను రాళ్ళను రొట్టెలుగా మార్చ మని సలహానిచ్చుచు, తానుమాత్రము రొట్టెలను రాళ్ళగా మార్చుటకు పూనును. అతనిని ఒక చేప నిమ్మనికోరిన (అతని రాజ్యమున చేపలుత్పత్తిగావుగనుక) నీకు ఒక సర్పము నిచ్చును.

న్యాయమగు నార్థికవిధానమున మారకమునుగూర్చిన నియమ మేమనగా మారకముజేయు నుభయపక్షములకు సదు పాయము చేకూరవలెను, లేదా ఒక పక్షమున సదుపాయము చేకూరినను రెండవపక్షముననధమమాయనర్థమువాటిల్లరాదు. అట్టి మారకము జరిపించు మధ్యవర్తికి అనగా వర్తకునికి తా నందుకు వినియోగించినకాలమునకు, బుద్ధికి, శ్రమకు తగిన న్యాయమగు వేతనమీయవలెను. ఉభయపక్షీయులకు నెట్టి సదుపాయము చేకూరెనో, మధ్యవర్తికేమి యొసంగబడినదో, అందుకు సంబంధించినయందరికి స్పష్టముగ తెలియవలెను. ఇందు నిగూఢతనము శాస్త్రవిరుద్ధమైన దైవవిరుద్ధమగు జ్ఞాన కల్పిత శాస్త్రమనుకరించునట్లగును. అందువలననే, ఆ జ్యావర్తకుడు వేఱొకచోట నిట్లుచెప్పెను. "రెండురాళ్ళ సందున కొట్టినమేకువలె క్రియవిక్రియములమధ్య పాపము గట్టిగా నంటియుండు" ననెను.

ఇట్టివింతయగు రాయి, కలపలకూర్పే మానవుల పరస్పర వ్యవహారములందుండి, తాము నివసించెడు గృహ మందుగల రాళ్ళు కలపలతోసహా సర్వముగూడ శాపమున వినాశన మొందును. ఆశాపమే ప్రపంచమున దొంగతనము జేసియు నిరపరాధినని యెంచు ప్రతివానిపైననుబడి నాశనము జేయును". "భూమిపైగల సర్వకలుషము"తో నిండి భార మగు నికృష్టసీసపు మూతతో, కౌర్యపిశాచమగు స్త్రీ దానిలోన గలట్టి వింతయగు కొలమానదృశ్యము వినాశన మును సూచించును. అనగా మోసగించువాని కౌర్యము మోసగింపబడువాని యజ్ఞానముచే గప్పబడి సామాన్య వ్యావహారికమని పరిగణింపబడుచు, బాహాటముగ నవశ్య మగు కౌర్యమని స్థాపించబడినది. "బేబుల్ దేశమున నా తిరుగవేసిన కొలపాత్ర సరిగపెట్టబడును".

ఇంతవఱకు మారకమునుగూర్చిన నాప్రసంగములో, దానివలని "సదుపాయము"ను గూర్చిమాత్రమే చెప్పితిని. కాని ఈ పదమందు రెండుభావములు గలవు. సదుపాయము అనుటలో మన కవసరమైనది చేకొనుటయనియు, రెండవది మనము వాంఛించునది చేకొనుటయనియుగూడ యగును. ప్రపంచమందలి యవసరములలో నాల్గింట మూడువంతులు, మనోభ్రమ మనోరథములుచే ఆశలు, అభిమానములు మొదలగు మనోభావములచే కల్పితమైనవే. కనుక మన వ్యయమును క్రమపరచుటయనగా, నిజముగ, మన మనో భావములను హృదయమును క్రమపరచుట యనవలయును,

కావున, వెలయొక్క నైజమునుగూర్చిన సరియైన ప్రసంగము చాలయున్నతమగు తత్వవిచారణమునకును మానసిక శాస్త్రమునకును జెందిన సమస్యయగును. బెత్లహేము ద్వారమువద్దనుండిన బావిలోని నీటివెలను డేవిడ్ నిర్ణయించినట్లు, కొన్నిసమయములందు వెలయొక్క నిర్ణయము మనోభావోద్రేకానుసారముండును. కాని వెలనుగూర్చిన తొలినిర్ణయములు మాత్రమిమి. ఒకవస్తువుయొక్క వెల దానినపేక్షించువాడు దానిని పొందుటకు పడు శ్రమయని చెప్పవలెను.

ఈవెల నాలుగు చలరాసులపై నాధారపడియుండును. మొదటిది, కొనదలచినవానికి వస్తువుపైగల కోర్కెపరిమితి; అందుకు ప్రతిగనమ్మెడువానికా వస్తువునుంచుటకుగల కోర్కెపరిమితి. రెండవది, కొనదలచినవాడు ఆవస్తువునుబడయుటకు పడగలశ్రమ; అందుకు ప్రతిగ, నమ్మెడువాడావస్తువు నుంచుకొనుటకు పడగలశ్రమ. ఈరాసులు యధికముగాచు వ్యవహరించును; అనగా ఒకవస్తువుపై కొనదలచినవానికోర్కెయాతని కితరవస్తువులపైగల కోరికకన్న యధికమగునపుడే కొనుటజరుగును; అట్లే ఆవస్తువుకొఱకై యతడు పడగల శ్రమ నితరవస్తువులబడయుటకుపడు శ్రమనుండి వినియోగించగల్గిననే వ్యవహరించుట జరుగును.

వెలయొక్క సహజస్వభావములు బహుక్లిష్టమై చోద్యమై, ముచ్చటగనుండును. పరీక్షింప దుస్సాధ్యమగునంతటి క్లిష్టముగనుండును. అందు ప్రతిలక్షణముగూడ దూరముగ పరీక్షించినకొలది, తుదకు ఒకమందలో నిర్భాగ్యమగు

దానికొసగు వెలనుగూర్చిన బేరములో భాగమట్లుదోచును. లేదా, దురదృష్టవంతులైన హతమొనర్చబడు పేదవారల వెలగూర్చిన బేరములోని భాగముగ పరిగణించనగును.

"నీకు మంచిదనితోచిన, నావెలనాకిమ్ము, లేకున్న నోర్మిదాల్చుము" అను పూర్వోక్తిని స్మరింపజేయును. కాని ప్రతిదాని వెల తుదకు శ్రమ లేక కార్మిక కృషినిబట్టి గణింపవలెనుగనుక, అట్టిప్రమాణమగు కార్మికకృషియొక్క నిర్వచనమవసరము.

కార్మికకృషి అనగా మానవజీవితములో నొకవ్యతిరేకముతోడి పోరాటము. జీవితము బుద్ధి, ఆత్మ, శరీరశక్తి ఇవి ఏదైన నొకసమస్యతోగాని కష్టముతోగాని, ప్రయత్నమునగాని, ఒక భౌతికశక్తితోగాని నెదుర్కొని శ్రమించుటయనియర్థము.

జీవితలక్షణముల నెక్కువ వినియోగపడిన శ్రమయుత్తమజాతిదగును; తక్కువ వినియోగపడిన శ్రమ న్యూనజాతిదగును. మంచిలక్షణమగు శ్రమ శారీరకశక్తిని పూర్తిగ సమ్మోదమున వినియోగింపజేయు నట్లెంతయగత్యమో అంత బుద్ధిభావముల వినియోగమునుగూడ గల్గియుండును.

బంగారమును వెండినిగూర్చి చెప్పునపుడొక నియమిత ప్రమాణములో నెట్లుచెప్పుదుమో, అట్లే శ్రమయొక్క విలువను వెలనుగూర్చి చెప్పునపుడుగూడ దానిస్వభావ లక్షణములను గ్రహించవలసియుండును. చెడ్డపని అనగా నిర్దాక్షిణ్యమగునది, అనుభవశూన్యమైనది. బుద్ధిహీనమైనదగు

పనియొక్క విలువ నిర్ణయింప వీలుకాదు. అది నిర్ణీతముగు లోహామిశ్రితమైన బంగారమువంటిది; పాడయిన యినుము* వంటిది.

శ్రమయొక్క స్వభావలక్షణములు దెలిసినదానివిలువ అన్ని విలువగు వస్తువులవలెనే, అపారితముగనుండును. ఐతే వస్తువులకొఱకు పడనగు శ్రమయొక్క పరిమితి మాత్రము మాఱుచుండును. ఆశ్రమయొక్క పరిమితి నిర్ణయించునపుడు, ఆ వస్తువులవిలువను అందుకు కావలయు శ్రమతో నిర్ణయింపవలెనుగాని శ్రమయొక్క వెలమాత్రము ఆవస్తువుల సంఖ్యలో లెక్కింపరాదు.

మనము రాతినేలలో నొక పండ్లవృక్షపుమొక్కను నాటదలచిన రెండుగంటలపని పట్టవచ్చును. దానినే మెత్తని స్థలములో నాటుటకరగంట కాలమే పట్టవచ్చును. ఆ మొక్కకు రెండుచోట్లనున్న నేల ఒకేవిధముగ మంచిదనుకొందము.

---

* నిజమగు కార్మికకృషిని గ్రీకులు దైవతుల్యముగనెంచి దానిని దేవతలకొసంగు గౌరవముతో గౌరవించిరి. అందుకే, అట్టి కార్మికకృషి "గౌరవార్హమై"నదనియు, దానికొసంగవలసిన ప్రతిఫలమును గౌరవమూల్యమనియు నర్థముగల పర్యాయపదము లిడిరి. అట్లే, అసత్యపుకార్మికకృషిని అనగా జీవనసాధనమునకు భంగకరమైన కృషిని గౌరవశూన్యముగను ప్రతిహతమున కర్హమైనట్టిదానిగను పరిగణించిరి. అట్టికృషికి "మృత్యువును దరిజేర్చు"నట్టిదను భావముగల క్రూరదేవతపేరు నిడిరి. అనగా, గణితమున సర్వశాఖలందు నైపుణ్యముగలదనియు, తన నిత్యకృత్యములందు ఖచ్చితముగ నుండునట్టిదనియు అర్థము. ఆధునికకాలమున అట్టిదేవతనే అనేకు లనుకరించుచున్నారు.

ఐతే, రెండుగంటలకాలములో పాతినమొక్క విలువ అర గంటలో పాతినమొక్కవిలువకంటె నెన్నటికి నధికముకాదు. ఒకటి రెండనదానికంటె నధికఫలమీయదు. మఱియు నొక యరగంటకాలపుపని మఱియొక యరగంటకాలపుపని సమాన మేకదా. ఐనను, ఒకమొక్కకు ఒకవంతు పని పెట్టెను. మఱియొకదానికి నాల్గువంతుల పనిబెట్టెను.

ఈ విషయమున యథార్థము వచింప కఱకునేలపైని పని మెత్తనినేలపైని పనికంటె చౌకయనికాదు, కాని కఱకు నేలపై చెట్టు మెత్తనినేలపై చెట్టుకన్న ప్రియమైనదగును. ఇందు మారకపు విలువ తరువాత నీవిషయముపై నాధార పడవచ్చును, పడకపోవచ్చును. ఇతరులకు అట్టి మొక్కలు వేయుటకై మెత్తనిస్థలము చాలాయుండిన, ఆ కటికనేలపై మొక్కయొక్క వెలయందా రెండుగంటలశ్రమను సరకు గొనరు. మఱియు, వృక్షశాస్త్రజ్ఞానము లేమిచే ఫలవృక్షము నకు బదులొకవిషవృక్షమును వేసిన మారకపు విలువ వెగటై, పడిన శ్రమ మఱింత నిష్ఫలమగును.

సామాన్యముగ చౌకపనియని పిలువబడునది, నిజ ముగ ననేకాటంకముల సాధించవలసినట్టిదన నగును. అపుడు కొద్దిఫలితమునకు నధికమగు శ్రమకావలసియుండును. ఐతే నట్టితఱిపడిన శ్రమను చౌకయనుటకుబదులు నెఱవేర్చిన లక్ష్యము ప్రియమైనదని యనవలయును. మనభోజనమునకై ఇంటికి పదిమైళ్ళు నడచిపోవలసినచో నడచుట చౌకయనుట ఎంత భావ్యమో, ఆ భోజనము సంపాదించుటకు చేయవలసిన

పదిగంటలకాలపు పనినికూడ చౌకయనుట నంతభావ్యముగ నుండును.

మనము నిర్వచింపవలసిన ఆఖరుమాట "ఉత్పత్తి".

ఇంతవఱకు నంతకార్మిక కృషి లాభదాయకం బని చెప్పితిని. ఏలయన, ఒకేతఱి కార్మికశ్రమయొక్క లక్షణమును లేక విలువను, దానియుద్దేశ్యమును, రెండింటినిగూర్చి పరిశీలించుట సాధ్యముకాదు. కాని యత్యుత్కృష్టమగు కార్మిక కృషియొక్క యుద్దేశ్యము వివిధముగ నుండవచ్చును. అది వ్యవసాయమునందువలె నిర్మాణాత్మకము కావచ్చును, రత్నముల జెక్కుటయందువలె నిష్ఫలదాయకము కావచ్చును; లేదా యుద్ధమందువలె వినాశనకారణము గావచ్చును. సాధారణముగ నిష్ఫలదాయకముగ కన్పట్టు కృషియొక్క నిష్ఫలతను నిరూపించుటసులభముగాదు.* కాని ఒకసామాన్య

* సరిగ చెప్పవలెనన్న, నిష్ఫలమగు కార్మిక కృషి అనగా ఒకకార్యమునకు సాంతముగనుపకరింపకయుండి, తిరిగి అంతకృషిసల్పవలసినట్లు చేయుకృషి అనిఅనవలెను. మఱియు, నసహకారమువలనగూడ ఫలితముచేకూరదు; అట్టికృషినిగూడ నిష్ఫలంబగుకృషియనియనదగును. నేనొకగ్రామమును జూచితిని. ఆగ్రామమొక లోయవద్దగలదు. అందుండి ఒకనది ప్రవహించుచు. తఱచుగ నాగ్రామస్థుల భూములన్నిటిని ముంచివేయును ఆగ్రామస్థులారీతిగ నదీజలములు తమభూములనుముంచివేయుచుండ ఎందుకు ఊరకుందురు? ఎందుకని అందరు సహకారముతో ఒకపెద్దగట్టుకట్టుకొని ఆనీటిని అరికట్టరు? అని నేనాగ్రామాధికారి నడిగితిని. అందుకాతడిట్లు సమాధాన మిచ్చెను. ఆగ్రామస్థులు ప్రతివారునుగూడ 'అట్లుచేసినచో నాకెంత సహాయమైన గూడునో అట్లే నాపొరుగువానికిని చేకూరును' అనిచెప్పుచు, ఎవరిపొలమునకువారు చిన్నగట్టు వేసికొనిరి. ఆ ప్రవాహమునకు బుద్ధిపుట్టినపుడుపొంగి పొర్లి వారిని, వారిపొలములనుగూడ ఊడ్చిమింగివేసెను.

సూత్రము "నిర్మితులుగానివారు విధ్వంసకులు" యను యదార్థమనుసరించి ఆభరణముల తయారుచేయువాని కళ ఒక వికారమైన వికృతడాంబికమున కుపకరించు ప్రమాదకరముగ నుండును.

తుదకు, అంత కార్మికశ్రమను సూక్ష్మముగ రెండు విధములుగ, వృద్ధి, క్షయకారణములగు కృషిగ విభజింపవచ్చును. వృద్ధియనగా జీవితోత్పత్తి సాధనమైనదనియు, క్షయమనగా మృత్యుకారణమైనదనియు గ్రహింపనగును. ఇందు హత్య యతి స్పష్టమగు క్షయకారణమగు పని; ప్రసవము, శిశుపోషణము యతి స్పష్టమగు వృద్ధికారకమగు శ్రమ. అనగా పనికిమాలిన సోమరితనమునకు క్షయమువైపున హత్య ఎంత హేయమగునదియో, ఇటు వృద్ధివైపున శిశుపోషణ మంత శ్లాఘనీయమైనదగును.

ఆ కారణముననే, శిశుపోషణమున అంతగౌరవము గలదు. కనుకనే, భార్యను సంతోషకారిణియగు ద్రాక్షతీగతోను, బిడ్డలను శ్లాఘ్యపాత్రమగు నాలీవ్ కొమ్మతోను సరిపోల్తురు. ఒక్క శ్లాఘ్యపాత్రతకే గాదు, శాంతిసూచకముగ గూడ గ్రహించనగును. ఏలయన, పెద్ద కుటుంబములు శాంతిసమయములందే పెంపొందును. వారు నలుదెసల విస్తరించిపోవుచు, ఒక పెద్ద బలాఢ్యుడు తన చేతిబాణముల దవ్వుదాపుల విసరుచు తన శక్తిని విస్తరింపజేయునట్లు, వీరును తమ స్వగృహప్రభావమును వెదజల్లుచుందురు.

కార్మిక శ్రమయొక్క ఫలితము వివిధముగ నుండును. ఒక దేశసౌభాగ్య మాదేశమందు జీవితసాధనముల జేకూర్చుటయందు, వినియోగించుటయందు నుపయోగించు కార్మిక శ్రమకు సరిగ సంబంధించియుండును. చేకూర్చుట, వినియోగించుటయనగా, కేవలము వివేకముగ నుత్పత్తి జేయుట మాత్రమే కాదు. వివేకముగ రవాణాజేయుట, వినియోగించుటగూడ యవసరము. కేవలము వినియోగమందే యోగ్యత లేదని సామాన్యముగ నార్థికవేత్తలు చెప్పుదురు. అట్లుకాదు, సరిగదా, కేవలము వినియోగమే ఉత్పత్తియొక్క యుద్దేశ్యము,-ముకుటము. అదియే యుత్పత్తియొక్క సుప్రసిద్ధత. మఱియు వివేకయుత వినియోగము వివేకయుతయుత్పత్తికంటె చాల కష్టతరమగు కళ. ఒక్కడుపయోగించగల సొమ్ము నిరర్వైమంది గడింపవచ్చును. ఐతే, ఒకవ్యక్తికిగాని ఒక దేశమునకుగాని కడు ముఖ్యమైనసమస్య, "ఎంతగడింతురు" అనునది గాక "ఎందుకు వెచ్చింతురు" అనునదియే యగును.

వెనుక నేను "మూలధనమును" గూర్చి సంక్షేపముగ నుడివితిని. అందుకు చదువరులాశ్చర్యపడి యుండవచ్చు. ఇక్కడ దానినిగూర్చియు, దాని నిర్వాహణనుగూర్చియు నిర్వచింపవలసి యున్నది.

మూలధనము అనగా "ప్రధానమగు లేక పుట్టుకారణమగు లేక మూలమగుపదార్థ"మని భావము. ఏదైన నుత్పత్తియగుటకుగాని మఱియొక యోగ్యమగు దానినుత్పత్తి చేయుటకుగాని యుపయోగపడు పదార్థమగును, దాని కితరమగుదాని

నుత్పత్తిచేయునపుడే యది యథార్థమగు మూలపదార్థమగును. అదియొక మూలము. ఈమూలమునుండి ఇతరమగు దానికి అనగా ఫలమును చేకూర్చునపుడే యామూలము యొక్క ముఖ్యోపయోగము గల్గును. ఆఫలము తిరిగి కాలక్రమమున మూలముల నుత్పత్తిచేయును. ఈవిధముగనే సజీవమగు మూలధనమెప్పుడును మూలధనముయొక్క పునరుత్పత్తినుండి యుద్భవించును. కాని మూలధనమునుమాత్రముత్పత్తిజేయు మూలధనము, మూలమునుత్పత్తిజేయు మూలమువంటిది; దుంపనుత్పత్తిజేయు దుంపవంటిదిగాని పుష్పించదు; విత్తులనొసగు విత్తులవంటిది, గాని యాహారమిడదు.

ఐరోపాదేశపు యర్థశాస్త్రమింత వఱకు నట్టి బుడ్లవంటి దుంపమూలములను వృద్ధిజేయుటయందుగాని, ఇంకాయధమముగ, వాటిని ప్రోగుజేయుటయందుగాని నిమగ్నమైయున్నది. అంతేగాని యొకపుష్పమునుగూడ చూడలేదు; దానినిగూర్చి యూహింపలేదు. అంతేగాదు బహుశ, మరగబెట్టినబుడ్లు కానోపు—గాజుబుడ్లు—గూపట్టు యువరాజు దెచ్చిన భస్మపు బావిలీలు (అయితే తుపాకిమందుగాక గాజుపొడిమాత్రమే అయిన మంచిదై యుండెడిది). ఇది అర్థశాస్త్రజ్ఞులుగూడ బెట్టుటనుగూర్చివివరించిన సూత్రములయొక్క తుదిలక్ష్యము; అర్థము అని తలంచినదానిఫలితము. వాటినిగూర్చి మఱింత స్పష్టమగు భావము గ్రహింప యత్నించెదము.

అత్యుత్కృష్టమగునట్టిది కడుస్వల్పమైనది మూల ధనముగ గణింపవలసినది బాగుగ జేసిన నాగటికఱ్ఱు. ఐతే, ఆ నాగటికఱ్ఱు మఱేమియు జేయక, నొక బహుపాద జీవియట్లనేక నాగటికఱ్ఱులమాత్రమే విస్తరింపజేసిన, నవి యన్నియుసూర్య రశ్మియందెంతగా మెఱసినను, ఆనాగటికఱ్ఱుమాత్రము మూల ధనముయొక్క యుపయోగమును గోల్పోయియుండెడిది. కాని యది సాలునందు అఱిగి, అట్టి గర్హనీయమగు అరుగుదులో తాను క్షీణతనేబొందియు, నద్భుతముగ మెఱయుటచే నది నిజమగు మూలధనమగును.

ప్రతిపెట్టుబడిదారుడు, ప్రతిదేశముగూడ నెదుర్కొన వలసిన నిజమైన సమస్య "నీకెన్ని నాగళ్ళుగల"వనునదిగాదు. "నీనాగటి చాళ్ళెక్కడ?" యనియే "ఎంత వేగమున నీమూల ధనము పునరుత్పత్తియగును?" అనిగాదు అట్టి యుత్పత్తియం దేమి జేయును ?" అని గ్రహింపవలెను. జీవితోపయోగకర మగు నేపదార్థము నొసంగును ? జీవితరక్షణకరమగు నే నిర్మాణకార్యమొనర్చును ? ఇందేదియు గానిచో, తనకు తానే పునరుత్పత్తిజేసికొనుట కేవలము నిష్ప్రయోజనము. ఏమి చేయకుండుటకన్న చెడుగొనర్చును. ఏలయన, మూల ధనము జీవనాశమునకును జీవపోషణమునకునుగూడ కారణ మగును. కాబట్టి తనకు తానే పునరుత్పత్తిజేయుట నిష్ప్రయో జనముకంటె ననర్థమగును. అది కేవల మొక నిర్దాక్షిణ్యమగు గణికుడు తనఖాపత్రముపైన యిచ్చిన ఋణమువంటిదికాని లాభ మెంతమాత్రము కాదు.

లాభముగాదు. దానినే ప్రాచీనులు సరిగ గమనించి ఇక్సియానువంటి వ్యక్తులజీవితములో జూపిరి, ఏలయన, మూలధనము శిరస్సువంటిది; భాగ్యమునకుత్పత్తిస్థానము. భాగ్యమునకు శ్రేయోజన్యస్థానము, వర్షమునకు శ్రేయోదయస్థానములగు మేఘము లట్లుండును. కాని మేఘములు నీటి నివ్వక తిరిగి మేఘములనే కల్పించిన, అవి తుదకుగ్రముగ వర్షమునకుబదు లురుములను, సస్యమునకుబదులు మెఱపుల నిచ్చును. ఇక్సియాను తన యతిథుల నొకవిందునకు సన్మానించి, తరువాత వారిని ఒక యగ్నికుండమునందు పడవేసెను. ధనముయొక్క సమ్మోహనముగూడ నట్లేయుండి, వేదనములో బంధించును, డేమాస్ వెండిగనివంటి వేదనకూపములో పడవేయును. ఇంకను ధనముయొక్క యుగ్రత మానందాపేక్షనుండి యధికారకాంక్ష కల్పించును. ఇక్సియా అట్లే నానందేచ్ఛనుండి యధికారమపేక్షించెను. ఆయధికారమునుగూడ సరిగ నర్థము జేసికొనలేమ. తనను రక్షించిన జీయస్ భార్యయగు జూనోను వాంఛించెను. ఆమెకు బదులొక మబ్బువంటి పిశాచాకృతిని కౌగిలించికొని తద్ద్వారా నరశరీరులగు మనుజసంతతిని నర్థాశ్వములయొక్క సంతతిని బడసినట్లితిహాసము చెప్పును. కేవలము భాగ్యనిమిత్తమగు భాగ్యముయొక్కశక్తి యొకనీడను కౌగిలించుకొనునట్లుండి యేవిధమగు సమ్మోదమునీయదు. (బైబిలునందు జెప్పినకథలో, గాలి భుజించెడి ఇఫ్రేయిమ్ తూర్పుగాలిని వెంబడించిపోవునట్లుండును; మిథ్యాన్వేషణము! డేంటీ నుడివిన గెరియాను

వంటి దురాశాపరుడగు దైత్యుడు తానెగురుచు వెనుకిరిగిన తన కాలిగోళ్ళతో గాలిని ప్రోగుచేయునట్లుండును.) ఇక నట్టి తరి గల్గుసంతతి పశుత్వ మానవత్వముల మిశ్రిమనైజముగల్గి యుండును. మానవవివేకముతో బుద్ధిని, ప్రాణమును రెంటిని యుపయోగించును. గాని పశుత్వపుశరీరము కబళించుచు, కఱకైన కాలిగిట్టలతో త్రొక్కుచు వర్తించును.

ఆపాపముననే యిక్సియాను తుదకొక చక్రమునకు బంధించబడెను. ఆచక్రిమే నిరంతరము గాలిలోతిరుగాడు బహుఘటి యగ్నిచక్రిము. అట్టీస్వార్థపరమై శుష్కమైన మానవకృషివలన నడివయసువరకు భాగ్యచక్రిము తిరుగాడిన నాచక్రము నిర్జీవమై నిరాత్మకమై కేవలమని త్తముగనే తిరుగుచుండును. కాని సకలమైనట్టి నిజమగు మానవకృషియందు ఎజికేల్ దృశ్యము తథ్యమగును. ఆచక్రిములయందు సజీవమగు మానవాంశయుండి, దేవతలుపోవుగతిని బోవుచుండును గాని మఱేవిధమునను బోవు.

ఇది మూలధనముయొక్క నిజస్వభావము. దీనిననుసరించియే చైతన్యముగల నొకరాజ్యమున రెండువిధములగు యథార్థమైన యుత్పత్తి నిరంతరము సాగుచుండును. ఒకటి విత్తనమునుగూర్చి, మఱియొకటి ఆహారమునుగూర్చి; అనగా భూమికొఱకగు ఉత్పత్తి, నోటికొఱకగు ఉత్పత్తి; యీ రెండువిధములగు ఉత్పత్తియు దురాశాపరులగువారు గాదె కొఱకేయని తలంతురు. ఐతే ఆగాదెయొక్క ప్రయోజనము తాత్కాలికము. దాచుటకును పిదప నాసరకుయొక్క

పంపకమునకు నుపకరించును. అటుగాక నిత్యము దాచుటకే అయిన కీటకాదులపాల్పడి, ఎలుకలకు పురుగులకుమాత్ర ముపకరించును. ఇక భూమికొఱకగు నుత్పత్తియంతయుగూడ భావివంటకే గనుక, యవశ్యమగు నుత్పత్తియంతయుగూడ నోటికొఱకేయగును. దానిపరిమాణము నోరునిర్ణయించును. కనుక నేను పైనజెప్పినట్లుత్పత్తికి మకుటము వినియోగము. ఒకరాజ్యముయొక్క భాగ్యమారాజ్యమందగు వినియోగ మునుబట్టియే గణింపనగును.

ఈసత్యమును స్పష్టముగ గుర్తించకపోవుటయే యర్థ శాస్త్రజ్ఞుల ముఖ్యదోషము. దీనినుండియే యర్థశాస్త్రజ్ఞుల గొప్ప దోషాభివృద్ధి, గొప్పదోషాదాయము కల్గుచుండును. వారిమనస్సులను సదా ద్రవ్యలాభము మీదనేగాని, నోటి లాభముమీద నిల్పరు. వేటకాడు పిట్టలకండ్లు మిరిమిట్లుగొల్ప జూపెడు నద్దమువలన పిట్టలదృష్టిచలించి యేవిధముగ నవి వాడుపన్నిన వలలందు నురులయందు జిక్కునో, అట్లే వీరును ద్రవ్యనాణెముల మెఱపున దృష్టిచలించి చిక్కులపాల గుదురు. చిన్నిపిల్లలు వారినీడలయొక్క తలలపై గెంతజూచు నట్లు, మానవకోటియేయగు యథార్థలాభముయొక్క నీడ యగు ధనలాభము నర్థింతురు.

కనుక, అర్థశాస్త్రముయొక్క తుదిలక్ష్యము సద్వినియోగ సాధనమును గూర్చుట, సమృద్ధియగు వినియోగమును గూర్చుట,అనగా, నొకపథార్థముగాని,సేవగాని, పథార్థమును

శ్రేష్ఠముగ నొనర్చుసేవగాని, సర్వమును సద్వినియోగ పరచుట యనవగును.

మిల్ యొక్క రచన అంతటిలో కడువింతయగు దోష మొకటిగలదు. అది తొలుత రికార్డోనుండి గ్రహించబడెను. అదేమన, మిల్ ప్రత్యేకమగు సేవను, పరోక్షమగు సేవనుండి విచక్షింప యత్నించును. అందుండి సరుకులయగత్యత కార్మి కాగత్యత గాదని దృఢముగజెప్పెను. అతడు వినోదార్థమగు స్థలముల తయారుజేయుటకు వినియోగింపబడు కార్మికులను, మెత్తని ముఖమలుగుడ్డ పరిశ్రమకై పనిజేయు కార్మికులనుండి విచక్షించును. పెట్టుబడిదారుడీ రెండువిధములుగ ధనము వెచ్చించుటయందు, శ్రమపడు కార్మికులకు గణింపనగు నారిక భేదము కల్గునని చెప్పెను. ఏలయన తోటమాలీల నియోగించుట కార్మికులకై యగత్యతనుజూపునుగాని ముఖమలుగుడ్డ కొనుటయట్లు కాదనును.*

---

* ఒకవస్తువుయొక్క ధరనుండి కార్మికకృషిని మినహాయింపవల సిన ముడిసరకు విలువనుగూర్చి యిచట తలంచలేదు. మధ్యస్థునికి చెల్లింప బడు వేతనముల ఫలితములగూర్చి యోచించుచు మిల్ ఈదోషమును చేసెను. "నేతగాని దినకూలి వినియోగదారుడు స్వయముగ తాను చెల్లింపడు" అని మిల్ అనును. క్షమించుడు; తోటమాలికి ఏవిధముగ చెల్లించునో అట్లే ముఖమలుగుడ్డ నేతగానికిని వినియోగదారుడు తన స్వంత డబ్బునుండి చెల్లించును. బహుశః, మధ్యవర్తులగు నౌకాయజమానికిని, ముఖమలువర్తకునికిని, అంగడివానికినిగూడ నతడు చెల్లించును. రవాణా ఖర్చు,కొట్టుఅద్దె,చెడిపోయినదానివెల, నిల్వకాలమునకగుదండగ,జాగ్రత్తగ నుంచుటకగుఖర్చు, వీనినన్నిటినిగూడ వినియోగదారుడే చెల్లించును. ఈ ఖర్చులన్నియును ముఖమలు ఖరీదుతోపాటు అధికముగ చెల్లించును. అట్లే

బ్రహ్మాండమగుదోషము, కడునింతైనదోషము వసంత పవనములందు కొడవలితో కోయుటకును, జాడ్యపుదుర్గంధములో మగ్గము నేయుటకును, కార్మికునికిమాత్రము భేదముండును. కాని యతనిని కొడవలి, విత్తులతో పచ్చనిచేనుకొఱకు పనిజేయమన్నను, లేక కత్తెర, పట్టుతో పచ్చనిముఖమలుకొఱకు పనిజేయమన్నను నాతని రాబడిపట్లమాత్రము భేదముండదు; మఱియు మనము దానిని కేవలము స్వార్థపరమైన వినియోగము జేయునంతవఱకు, మనమాముఖమలుగుడ్డపై నడచినను లేక దానిని ధరించినను, కార్మికునికేమియు సంపర్కము లేదు. కాని మన వినియోగమెట్లైన నస్వార్థరాహిత్యముగ నున్న, మనమావస్తువుల వినియోగించు విధానమునందేగాక, మనకవసరమగు వస్తువులరకమునందుగూడ నాతనికి కుతూహలముండును.

ఇప్పుడొక్కసారి మిల్ ప్రతిపాదించిన యినుపసామగ్రినిగూర్చిన సిద్ధాంతమునుగూర్చి యోచింతము. కార్మికునికి తత్క్షణము చేకూరులాభమునకు సంబంధించువఱకు నాతని

---

తోటమాలికిని గడ్డిధరతోపాటు అధికముముట్టును. వినియోగదారుని పెట్టుబడివలననే గడ్డిలభించును; ఐతే, అట్లుకోసికట్టిన తరువాత రెండుదినములవఱకును వినియోగదారుడు చెల్లింపకపోవచ్చును. అట్లే వినియోగదారుని పెట్టుబడివలననే ముఖమలుగుడ్డకూడ ఉత్పత్తికాబడును. ఐతే అది యుత్పత్తిచేయబడిన ఆరుమాసములవఱకును వినియోగదారుడు చెల్లింపకపోవచ్చును. "కొనెడువారిని విడువవచ్చునుగాని మూలధనమును మాత్రము విడువలేము" అను మిల్ చేసిన నిర్ణయము కడుసత్యదూరము. అట్లు మన పట్టణములం దమలులోనున్నదేమో నాకు తెలియదు.

నొక ఫలవృక్షమును పెంచుటయందు నియమించినను లేక నొక బాంబును తయారుచేయుటయందు నియమించినను ఏమఖ్యాత్రము భేదముండదు; కాని యావస్తువులను నేను వినియోగించు విధానమునమాత్రము చాల తీవ్రమగు భేదముకలదు. ఈరెండింటి వినియోగముగూడ నాస్వార్థము కొఱకు కాదనుకొందము. ఐనను నాతనిపట్ల తుదిభేదమే మన, నాతని శిశువు అస్వస్థతగయున్న నాతనిగుడిసెలోనికి నే నొక మంచిఫలము పట్టుకొనిపోయి వానికిచ్చినదానికిని, అందుకుబదులు వానిగుడిసెమీాద నొక బాంబు వేసి ధ్వంసము చేసినదానికిని భేదముండక తీరదు.

కర్షకునికింకను కడు అన్యాయము గల్గును. పెట్టుబడిదారుడు ఫలమును స్వార్థమునకు వినియోగించుట* జరుగును.

---

* మదుపుదారుల ధనమే అన్యాయమగు యుద్ధములకు మూలాధారము. ఇది ఐరోపాఖండమునగల ధనముయొక్క ఘోరకృత్యసరళి. న్యాయమగు యుద్ధముల కంత ధన మవసరముండదు. ఏలనన, న్యాయమగు పోరాటముల సల్పువారు వాటియుచితముగనే నిర్వహింతురు. కాని అన్యాయపు యుద్ధములకు మానవుల దేహములను, ఆత్మలనుగూడ కొనవలసియుండును. అనేక మహోగ్రసాధనములనుగూడ కొనవలయును. అందుకే అట్టిసంగ్రామముల కమితమగు ధనవ్యయ మవసరము. అంతేగాక, కావలసిన ఔదార్యముతో, న్యాయముగ వర్తించుచు నొకగంట మనశ్శాంతిగూడ కొనజాలని ప్రజలతోనిండిన దేశములు పరస్పర దుర్భీతివలన క్రోధముతోగూడిన అనుమానమువలన అగు నమితవ్యయమునకు సిద్ధపడును. ప్రస్తుతము ఫ్రాన్సు ఇంగ్లాండు దేశములు ఒకరినుండియొకరు, ప్రతి సంవత్సరము కోటిపౌనుల ఖర్చుచేసి, దుర్భీతిని కొనుక్కొనుచున్నారు. — మహాద్భుత సంవత్సర ఫలితము, సగము ముండ్లు, సగము సర్పములవంటి పర్ణములతోగూడిన సాలుసరి

బాంబులను అంపకమునకై యితరులకమ్మోట జరుగును. అన్ని విషయములందును, మొత్తముమీద వాణిజ్యవ్యాపార సూత్రముల ననుసరించి, యట్లు నిర్మితమైన బాంబుయొక్క యోగ్యత తుదకు ఎవరిదో యొకరి గృహమును నాశనము చేయుటయే. నీయభీష్టానుసారముగ నీపొరుగువానికొఱకు దార్క్షపండ్లనుగాని తుపాకిగుండ్లనుగాని యుత్పత్తిజేయుము; అట్లే నీపొరుగువాడును మారక వ్యాపారమునకై నీకొఱకును దార్క్షపండ్లనుగాని తుపాకిగుండ్లనుగాని యుత్పత్తిచేయును; మీరుభయులును మీనాట్లననుసరించి ఫలితమునుపొందుదురు.

కనుక నుత్పత్తికి నిజమగుపరీక్ష, వినియోగవిధానము, వినియోగముయొక్క ఫలితము. ఉత్పత్తి అతిశ్రమతో వస్తువులను తయారుజేయుటయందే లేదు; ఉపయుక్తముగ విని

సస్యము — నిరంతరము సత్యమునకు బదులు దుష్కాంక్షనుగూర్చి బోధించుచుండు నాధునిక అర్థశాస్త్ర సహాయమున విత్తనముల నాటి, పండించి, కోసి, నిల్వజేయబడుచున్నది. మఱియు, అన్యాయపు యుద్ధములు శత్రువులను దోపిడి చేయుటవలన పోషింపబడును; లేదా మదుపుదారు లిచ్చెడు ఋణములవలన పోషింపబడును. ఈ ఋణములు తరువాత ప్రజలపై పన్నులు విధించబడి తీర్చబడును. పాపము! ప్రజలకాయుద్ధముల నిర్ణయమునగాని, ఆయుద్ధ ఋణముల తీర్మానమునకై విధింపబడు పన్నులవిధాన నిర్ణయమునగాని ఏమాత్రమును అధికారముండదు. సర్వమును నిర్ణయించు సంపూర్ణాధికారము మదుపుదారులదే; వారి మూలధనమే యుద్ధములకు మూలకారణము. ఐతే, నిజమగు మూలకారణము దేశమంతటియందును ప్రజలయందుగల దుష్కాంక్షయగును. ఆ దుష్కాంక్షయే ప్రజలయందు విశ్వాసమును, యథార్థమును, న్యాయమును లేకుండజేయును; తుదకు, కాలక్రమమున, ప్రతివ్యక్తికిని కష్టనష్టప్రాప్తి కల్గును.

యోగించు వస్తువులందు కలదు. మఱియు నొక దేశమునకు ముఖ్యమగు సమస్య ఎందరు కార్మికుల నియోగించిరి ? యను నదికాక 'ఎంత ప్రాణోత్పత్తి జరిగెను ?' యనియే అని గ్రహించవలెను. ఏలయన, యుత్పత్తికాశయలక్ష్యము విని యోగమెట్లో వినియోగమున కాశయలక్ష్యము జీవము.

ఈ విషయమును నేను నిష్కర్షగ చెప్పుటకు బదులు చదువరులు తమకుతామే నిర్ణయించుకొందురనియెంచి వారికే విడిచితిని. కాని యిప్పుడు కొంతవఱకు విషయముల విశదీకరించితిని. ఇక్కడ వచ్చినసమస్యలకు చెందిన యితర విషయము లన్నియు మిక్కిలి క్లిష్టముగనుండును. వాటినన్నిటినిగూర్చి యిచట పరిశీలించుటకు సావకాశము లేదు. గనుక నిక్కడ ఒక్క ముఖ్యమగు గొప్ప విషయముమాత్రము స్పష్టముగ జెప్పి ఈశీర్షికను ముగింతును.

జీవముగాని భాగ్యములేదు. జీవము = ప్రేమ, ఆనందము, ఆహ్లాదములతోగూడిన జీవము. ఏ దేశ మతి యెక్కువ మంది యుత్తముల, సౌఖ్యజీవుల పోషించునో నదియే మహా ధనవంతమగు దేశము. ఎవడు తనజీవితకార్యసాధనమునందు త్తీర్ణుడై, తనవ్యక్తిమూలమునను, ఆస్తిమూలముననుగూడ నితరుల జీవితముల కత్యధికసహాయభూతుడగునో నాతడే యత్యధిక శ్రీమంతుడు.

ఐతే నొక వింతయగు నర్థశాస్త్రము ఇంతవఱకుండెను, ఇంకను నుండగలదు. స్వాభిలాషపై నెలకొల్పబడిన యర్థశాస్త్రము. అదియే దేవతలనుగూడ రెండుపక్షములుగ

జేసి, నాకపక్షమును నరకకూపమునదోసి, స్వర్గమందలి యార్థికవ్యవస్థనుగూడ ధ్వంసము జేసిన యర్థశాస్త్రము.

"అతిమెక్కువమంది యుత్తముల, సౌఖ్యజీవుల"యని జెప్పితిని. ఉత్తమము జనాభాసంఖ్యతో సమన్వయించునా? సమన్వయించును. సమన్వయించుటయేగాదు, ఉత్తమలక్షణము జనసంఖ్యాభివృద్ధి కత్యగత్యము. మిక్కిలియెక్కువగు ప్రాణికోటి మిక్కిలియెక్కువగు సుగుణసంపత్తివలననే వర్ధిల్లును. ఈవిషయమున జనసంఖ్యకు సంబంధించిన సూత్రమునకును జంతుసంఖ్యకు సంబంధించిన సూత్రమునకును చాల భేదముకలదు. జంతుసంఖ్యాభివృద్ధి యాహారలేమిచేతను, జాతివైషమ్యమునను నరికట్టబడును. ఎలుకలసంఖ్య పిల్లియొక్క యాకలిచే నరికట్టబడును. పిల్లులసంఖ్య యెలుకలలేమిచే నరికట్టబడును.

మానవుని జంతువుగ పరిగణింతుమా, వానికిగూడ నీ సూత్రములు వర్తించును; క్షుధ, జాడ్యము, యుద్ధము—ఇవి యింతవఱకు మానవసంఖ్య నరికట్టుట కవసరమగు నడ్డంకులుగ నుండెను. అవియే నిజమగు నడ్డంకులుగ నుండెను. మానవుని ప్రధానమగు కృషియంతయు, తనను తా నెంత వడిగా నాశనము జేసికొననగును, తన నివాసగృహముల నెట్లు ధ్వంసము చేసికొననగును, తన సుప్రసిద్ధచాతుర్య వినియోగముతో క్షామమును, జాడ్యబీజములను, ఖడ్గకార్యమును ఎంత యెక్కువగ విస్తరింపజేయనగుననియే సాగినది. కాని మానవుని మృగేతరునిగ నెంచిన, నాతని యభివృద్ధి ఈసూత్రములవలన నరికట్టబడదు. ఆతని ధైర్యము, ప్రేమ

యొక్క పరిమితివలననే మితినొందును. ఐతే నీరెంటికిని గూడ మితిగలదు; మత మవశ్యమగత్యము; మానవజాతికి గూడ మితిగలదు; కాని యింతదనుక నామితిని జేరలేదు; ఇంకా కొన్ని యుగములవఱకు జేరదు.

మానవ మనోవర్తనములన్నిట నర్థశాస్త్రజ్ఞులు జన సంఖ్యనుగూర్చిచేయు విచారణములంతటి విచారకరమైన వేవియు నే నెఱుగను.

కార్మికునిస్థితిని యభివృద్ధిచేయుట కాతనికధికమగు కూలియొసంగుటవలననని చెప్పితిని. "అట్లుకాదు, వానికూలి హెచ్చించిన వాడు జనసంఖ్యాభివృద్ధికి దోహదమై తుదకు వాని తొలి హీనస్థితికివాడుదిగును. లేదా వానికిచ్చినకూలితో వాడు త్రాగుబోతగు"నని యార్థికవేత్తయనును. నిజమే. వానిచిత్తమట్లేవర్తించును. అది నాకు తెలియును. కాని వానికీ చిత్తము నెవ్వరిచ్చిరి? నీవెవరనిగూర్చి యిట్లుచెప్పితివో వాడు నీకుమారుడగుననుకొందము. అప్పుడుకూడ నిట్లేయందువా? వానిని నీపరిశ్రమాగారమున నెన్నటికిని నియమింపనేర నందువా? ఆతనికి న్యాయమగుకూలినిగూడ నివ్వనందువా? ఏలయన, నీ వట్లుచేసితివా, అతడు త్రాగుబోతై, పదిమంది పిల్లలను గ్రామములోవిడిచిచచ్చును! "ఈబుద్ధిలక్షణములను నీకుమారునకెవరిచ్చిరి?" యని నే నడుగవలసియున్నది. వాని కవి వంశపారంబుగ వచ్చినవా? లేక విద్యచే గల్గినవా? ఏదో యొకదానివలన సంక్రమింపవలెగదా! వానికివలెనే, పేద వారికిగూడ సంక్రమించును.

‘ఈపేదవారవశ్యముగ మనకంటె నితరమగుజాతికి చెందియుందురు. ఉద్ధరింపనసాధ్యముగాదు! (అట్లే కొందరు లోపలనుకొందురుగాని పైకి ధారాళముగ నెవరును జెప్పుట యిప్పటివఱకు నేను వినలేదు) లేదా వారికిగూడ మనము పొందిన రక్షణమునే యొసగి, వారినిగూడ మనవలెనే బుద్ధిమంతులుగ నాత్మనిగ్రహులుగ నొనర్చి మనము చాల వివేకవంతులము క్రమవర్తనులముగదా—ఇతరులనుపకరింప కష్టమగు నాదర్శకులుగ జేయవచ్చును. “కాని వారికి విద్యయలవడ”దందురు. ఎందుకలవడదు? అదే ఇక్కడి ముఖ్యమీమాంసవిషయము. ధనవంతులు పేదవారికి భుక్తినిడరనియు, ధనవంతులయందిది పెద్దదోషమని దాతృస్వభావులందురు. బీదజనులు వారినిమోసగించి దాచివేసినయాహారముకొఱకై భగవంతుని* వేడుదురు. పాపము! వారియెడ జూపిన క్రౌర్య

* ఈ వాక్యములందు నేను ప్రజాసామ్య సిద్ధాంతమునందలి ఆస్తి విభజనమునుగూర్చి చెప్పుటలేదు, దానిని సమర్థించుటలేదు. ఆస్తి విభజనము ఆస్తినాశనము. దానితోపాటు సకలఆశలు, సర్వకృషి, సర్వన్యాయము గూడ నాశనమగును. అది కేవలమొక అయోమయావస్థ. ఆధునిక అర్థశాస్త్రమును నమ్మువారందరును అట్టి అయోమయావస్థకే దారి తీయుచున్నారు. అందుండి వారిని మరలించుటకే నాయత్నము. ధనవంతుడు తన ధనమునుంచుకొనుటవలన పేదవారికి భుక్తిని నిరాకరింపడు. ఆ ధనమును నీచముగ నుపయోగించుటవలననే, పేదలకు భుక్తిని నిరాకరించును. ధనసంపద ఒక విధమగు బలము. ఒక బలవంతుడు తాను బలము కల్గియుండుటవలన ఇతరులకు హానిలేదు; కాని ఆ బలమును ఇతరులకు హానికరముగ నుపయోగించిననే వారికి హాని కలుగజేయును. సామ్యవాది ఒక బలవంతుడు ఒక బలహీనుని పీడించుట జూచి, వెంటనే, “ఆ బలవంతుని భుజములను విరుగగొట్టుడు” అని

మాహారము నిరాకరించుటకాదు. వారికతిన్యాయముగ చెందవలసిన దాహారముకాదు. జీవితమాహారముకంటె నున్నతమైనది.

ధనవంతులు పేదవారికాహారముమాత్రమే నిరాకరింపరు. వివేకమునుగూడ నిరాకరింతురు; సుగుణమును నిరాకరింతురు; ముక్తిని నిరాకరింతురు. మందకాపరిలేని గొఱ్ఱెలమంద! మీదృష్టినుండి దాచబడినది పచ్చికయేకాదు;

---

అని కేక లిడును. కాని నేను చెప్పిన దేమన "ఆతడా బలమును సద్వినియోగపరచునట్లు బోధించుడు" అని అందును. ధనార్జనకు కావలసిన ఓర్మి, బుద్ధిబలములను ప్రసాదించిన దేవుడు, ఆ ధనమును విరజల్లమని గాని, ఇతరుల కిచ్చివేయమనిగాని నిర్దేశింపలేదు. ఆ ధనమును మానవసేవకై వినియోగించవలెననియే నిర్దేశించెను. అనగా దోషులపతితుల జేయుటకును, దుర్బలులకు సహాయపడుటకును వినియోగింపవలెను. అనగా, మొదట ధన సంపాదనార్థము పాటుపడుటయు, పిదప దాని సద్వినియోగార్థమై విరామమును ఆదేశించబడెను. విరామము జీవనాశనమునకు గాదు; జీవపోషణమునకే నిర్దేశింపబడినది. పేదవారు సదా పేదలుగనుండ నెంచుట ఒకపొరపాటు లేక అవివేకము—ఒకపిల్లవాడు నీటిమడుగులో పడునట్టిపొరపాటు, లేక ఒకకుంటివాడు ఒకబజారుదాటుచు పడునట్టి పొరపాటువంటిది. ఐనను, దారిబోవువారనేకులు ఆపిల్లవానిని నీటినుండితీయుదురు; ఆకుంటివానికి సహాయపడుదురు. అతి అధమపక్షముగ చెప్పవలెనన్న, ప్రపంచమందలి పేదవారందరును అట్టి అవిధేయులగుచిన్నపిల్లలు, అజాగ్రత్తగనుండు అంగవికలులనవచ్చును. ఇక ధనవంతులందరు వివేకవంతులనియు, బలవంతులనియు చెప్పవచ్చును. అప్పుడు, అటు ప్రపంచమున అందరినిగూడ తనవలెనే పేదలుగ, శక్తిహీనులుగ, వివేకహీనులుగ జేయవలయుననెడి సామ్యవాదము సరియైనదికాదు. ఇటు ఊబిలోచిక్కుపడిన పిల్లలందరను అట్లే విడిచియుండవలెనను ధనికులవాదమును సరియైనదికాదని గ్రహించవలెను.

పచ్చిక ఆహారము! బహుశః మీకు దానికై గల హక్కును గూర్చి పోరాడవచ్చునేమోగాని మీయితర హక్కులగూర్చి మొదట పోరాడవలసియున్నది. కావలెననిన, మీకు చెంద వలసిన రొట్టెముక్కలను మీరడగండి; అయితే వాటిని చిన్నపిల్లలవలె కోరుడుగాని కుక్కలవలె కోరవద్దు. పోషింప బడుటకు మీకు చెందినహక్కుకై పోరాడుడు; కాని మీ పవిత్రతకు, నిష్కళంకతకు, పరిశుద్ధతకు మీకుగల హక్కున కంతకంటె గట్టిగ పోరాడుడు.

పాటకజనులగూర్చిన ఈమాటలు వింతగ నుండును. ఏమి పవిత్రత! ధరింపపోడుగైన దుస్తులులేవు; పూసికొను టకు తైలములులేవు; మొరటుకుళాయిలతో, మొరటుమాట లలో, చెప్పరాని హీనమగు సేవచేయువీరికి పవిత్రతా?'' నిష్కళంకత!—కళాహీనమగు కండ్లతో, శుష్కించిన శరీ రాంగములతో, కడుమాంద్యమగు బుద్ధితోనుండు వీరికా నిష్కళంకత? పరిశుద్ధత! దుష్కామాతురులై, నీచాలో చనలగల్గి, దుర్గంధశరీరములతో, మోటుబారిన నాత్మ లతోనుండు వీరికాపరిశుద్ధత?'' అట్లేయగుగాక; ఐనప్పటి కిని ప్రస్తుతము భూమిపైగల మానవులయందెల్ల, వారే మిక్కిలిపవిత్రులు, వారేనిష్కళంకులు, వారే పరిశుద్ధులు. నీవు పైనజెప్పినట్లు వారుండవచ్చును; ఐతే వారినట్లువిడిచి యుంచిన మనకంటె వారే పవిత్రులు.

ఐతే వారికేమిచేయగలము? ఎవరు వారికి వస్త్రము లివ్వగలరు? ఎవరు విద్య గఱపగలరు? ఎవరు వారిసంఖ్యల

నరికట్టగలరు? తుదకు వారిలో నొకరినొకరు భక్షించవలె గాని, వారికి గత్యంతరమేమి ?

ఆర్థికవేత్తలు సామాన్యముగ నధికజనాభివృద్ధికి మూడు పరిష్కారసాధనముల సూచింతురు. ఈ సాధనముల వలన సిద్ధించు పర్యవసానమునకు భిన్నమగు వేఱొకవ్యవస్థ చేకూరుగాక యని నేనాశింతును.

వారు నుడివెడు మూడుసాధను లేవన ; పరదేశ ప్రాంతములకు వలసపోవుట; బంజరుభూములను సాగులోనికి తెచ్చుట; వివాహమును నిరుత్సాహపరచుట.

తొలి రెండుసాధనములును సమస్యను విడనాడును, లేక విలంబనముజేయును. ప్రపంచమంతయు జనులతో నిండుటకుగాని, ప్రపంచమం దెడారులనన్నిటిని సాగుజేయుటకు గాని యింకను చాలకాలముపట్టును, ఐతే ప్రపంచమున నెంత నివాసయోగ్యమగు భూమికలదు యని యడుగుటకు బదులు, యున్నట్టి నివాసయోగ్యమగు భూప్రాంతము లెంతెంత యెక్కువమందిని పోషింపవలయును అనునదియే ప్రశ్న.

చూడుడు, "పోషింపవలయును అంటినిగాని "పోషింపగలము" యనలేదు. రికార్డో అతని మామూలుదోషముతో "సహజమగు కూలి" అనగా "కార్మికునిపోషించునది"అని నిర్వచించెను. వానిని పోషించునది ! సరే. 'ఎట్లుపోషించునది' యని యొకకార్మిక బాలిక ఈభాగముచదవగానే ప్రశ్నించినది. ఆమెప్రశ్నను విపులపరచెదను.

"వానిని పోషించుట ఎట్లు?" మొదట ఎంత జీవిత కాలము? అట్లు పోషింపబడు కొంతమందిలో నెందరు వృద్ధాప్యమువఱకు జీవింపవలెను? ఎందరు చిన్నవయసువఱకు జీవింపవలెను? అనగా నీవు వారికొసగు పోషణము వారినే ముప్పది లేక ముప్పదిఐదేండ్ల వయసునందో, బలహీనులగు పిల్లలు, తిండిచాలని పిల్లలతో సహా, చనిపోవునట్లొసంగుదువా? లేక సహజమగు వారి జీవితకాలమంతయు పోషించునట్లొసంగుదువా? మొదటివిధమున పోషణమొసగిన చాలయెక్కువ మంది ఒకరివెంబడి ఒకరు వడిగ వచ్చెడువారిని పోషింతువు. రెండవవిధమున కొలదిమంది సౌఖ్యవంతులను పోషింతువు. ఐతే రికార్డో ఇందు దేనిని సహజమగుస్థితిగా భావించును? ఇందేస్థితికి ఆయన పేర్కొనిన సహజమగుకూలి చెంది యుండును.

మఱియు, సోమరులు, యజ్ఞానులు, అవివేకులునగు పదిమందికి పోషణాధారమగు కొంతభూమి, తెలివిగల్గినకృషికులు నలుభైమందికి పోషణమొసంగును. ఇందేది సహజమగు స్థితి? ఈరెండుస్థితులలో నేస్థితికి సహజమగుకూలి వర్తించును.

మఱియు, కొంతభూమి కృషివంతులగు నలుబదిమందికి పోషణాధారమొసంగుచుండును. వారు చాల యజ్ఞానులనుకొందము, అట్టివారి యజ్ఞానముతో విసుగుజెంది, వారి యజ్ఞానవిచ్ఛిత్తికై, వారిలో పదిమందిని శంఖ్యాకార లక్షణముల పరిశోధనకును, నక్షత్రపరిమాణ పరిశోధనకును నియమించిరందము. ఈ పదిమందియొక్క కాయకృషి ఆ

భూసేద్యమునుండి తొలగింపబడెను. అందువలన కొంత యాహారలోపము గలుగును. ఆ యాహారలోపమును మఱి యొక రూపేణ ఆ యాహారాభివృద్ధిజేసి పూరింపవలెను. లేదా యట్టి పరిశోధనలకు నియమింపబడినవారు నిరాహారులై యుండవలెను, లేదా వారికి బదులు మఱియొక పదిమంది నిరాహారులై యుండవలెను. ఈశాస్త్ర పరిశోధకుల సహజ మగు కూలియెంత? ఈకూలికి వారి తొలికృషియందలి కూలికి గాని, వారు వేరేరూపేణ చేయు ఉత్పత్తికొసగు కూలికి గాని గల సంబంధమేమి? ఎట్లు నిర్ణయింపనగును?

మఱియు, ఆ భూమి మొదట శాంతియుతులు, భక్తి పరులగు నలుబదిమందిని పోషించుచుండిన దనుకొందము. కొంతకాలమునకు వారు కలహించుకొనుచు తమ ఉత్తమ లక్షణములు విడిచిపెట్టిరందము. వారి పోరాటములను తగు వులను పరిష్కరించుయోచనకై వారిలో నైదుగురను నియ మించిరందము. మఱిపదిమంది ఆ నిర్ణయముల నమలుజరుపు టకుగాను చాలవిలువగు ఆయుధములతో సాయుధపాణులుగ జేసిరందము. మరి అయిదుగురను దేవునిగూర్చి ఆస్తికబోధన మతిగంభీరముగ జేయుటకు నియమించిరందము. అప్పుడు మొత్తముమీాద నుత్పత్తిశక్తి కేమిసంభవించును. ఆ దైవ బోధకులు, న్యాయపాలురు, సాయుధపాణులు అగువారికి సహజమగు కూలియెంత?

ఈసమస్యలను రికార్డో యనుచనులకు వారియిష్టాను సారముగ చర్చించుటకుగాని, విడచుటకుగాని వదిలివేతును.

ఇక మిల్ కొంతభాగముమాత్రము చర్చించిన కార్మికతరగ తులభావిని గూర్చిన ముఖ్యాంశముల నిచట నుడివెదను. సామాన్యముగ నర్థశాస్త్రజ్ఞుల రచన లట్లుగాక, నాతడా యాశ్వాసములందు ప్రకృతిసిద్ధమగు విధానమునందు కొంత విలువగలదని సమ్మతించుచు, నట్టి ప్రకృతిస్వభావవినాశనము గూడ సంభవింపవచ్చునని విచారమును వెలిపుచ్చెను.

కాని యీవిషయమై మన మాందోళనపడనక్కఱలేదు. మానవులావిరిని త్రాగలేరు, రాళ్ళనుతినలేరు. ఒకభాగమున నత్యధిక జనసంఖ్యగలదనగా, న్యాప్రాంతమున మనుష్యులకు గాని, పశువులకుగాని, వినియోగపడు అత్యధికశాకాహారము కలదనిభావము. మిక్కిలి పరిశుభ్రమైనగాలి, పరిశుభ్రమగు నీరుగూడ కలవని భావము, అందుకు, గాలిని శుభ్రపరచుటకు వలయు అడవులు, తీవ్రమగు నెండవేడిమినుండి నదులను పోషించు సెలయేళ్ళను సంరక్షించు పచ్చికలతోనిండిన వాలు భూమియు కలవనిగూడ భావింపవలయును.

కావలెనన్న ఇంగ్లాండుదేశ మంతయుగూడ ఒక పారి శ్రామిక పట్టణముకావచ్చును. ఇంగ్లాండుదేశీయు లందరును మానవకోటిమేలుగోరి త్యాగశీలురై, నిరంతరశబ్దములో, చీకటిలో, దుశ్భరదుర్గంధములో నివసింపవచ్చును. కాని ప్రపంచమంతయు నొక కర్మాగారము కానేరదు. ఒకగని కూడ కానేరదు. మానవబుద్ధి ప్రాబల్య మెంతైననుగూడ మానవకోటి నినుమును జీర్ణించుకొనజేయలేదు; ద్రాక్షరసము నకు బదులు హారిదమును త్రాగునట్లొనర్చలేదు. మానవ

దుష్కాంక్షగాని, మానవక్రోధముగాని, మానవజాతి నెన్నటికిని పోషింపనేరదు. సువార్తయందు జెప్పిన సోడమ్, గమొరా యను రెండుపట్టణములలో నిరంతర పాపకృత్యములొనర్చుచు మితిమీరిన పాపభూయిష్ఠమగు నుల్లాసమున విందులుసల్పుచు కొంతకాలముగడపినను తుదకు దేవుని యాగ్రహమునకు పాత్రులై బూడిదగమారిపోయినవా పట్టణములు; అందున్న జనులు. మానవులన్నమితిని జీవించునంతకాలము దూరమున నున్న లోయలన్నియు నీశ్వరకల్పితంబగు సువర్ణచ్ఛాయగల వరిచేలతోనిండి యాహ్లాదకరముగ నుండవలయును. భగవత్సృష్టియందలి మానవకోటియంతయు ద్రాక్షరసాస్వాదనస్థలమువద్దను, బావికడను కెవ్వున కేరుచు కేకలిడవలయును.

యంత్రసాధనమున జేయు వ్యవసాయమువలన కల్గు విస్తారమైన పైమెఱుగులగూర్చికూడ చాదస్తులగు నార్థికవేత్తలు భయపడనక్కఱలేదు. జనులు వివేకవంతులుగనుండిన వారియాహారమును వారి ఆనందమునుగూడ వారే జేకూర్చుకుందురు; నివాసయోగ్యమగు భూభాగముల నానందమున నోలలాడజేయునట్టి వివేకమువలన నేజనసంఘమైన వృద్ధిపొందగలదు. ఎడారికిగూడ నియమితస్థానము, నియమిత కర్తవ్యము గలదు. ఈ మహానిరంతరయంత్రమునకు గండరము భూమియిరుసు; దానినాడి సంవత్సరము; దానిశ్వాస సముద్రము. అట్లు నిరంతరము దిరుగుచు, మహాసామ్రాజ్యాధికృత సాగుకానేరని కొండలచే పరివృతమై, అంతులేని యిసుకచేనిండిన యెడారిప్రదేశములకుగూడ వాటి సహజ

మగు పొగమంచును అగ్నిని ప్రసాదించును. కాని వాటిమధ్య ప్రాంతములు, భూములు నివాసయోగ్యముగనుండి అత్యంతామోదముగ జనసమూహముతో నిండియుండును.

హృదయమందలి యాస, నయనములందలి కాంతి యగును. ఏదృశ్యముగూడ నిరంతరము విసుగుపుట్టించనంతటి సమ్మోదదాయకముగ నుండదు. కాని యానందముతో సల్పు మానవకృషివలన సౌభాగ్యవంతముగనుండు దృశ్యమొక్కటియే నిరంతరము సమ్మోదదాయకముగ నుండును. చదునైన పొలములలో యందములగుతోపులలో, ఫలవంతములగు తోటలలో, వరుసదీర్చి, సమ్మోదమొసగు దగ్గరదగ్గరనుండు వసతిగృహములలో నిరంతరానందదాయకమగు మానవకోటి కంఠధ్వనులుమ్రోగుచు, జీవితసౌరభముతోగూడిన దృశ్యమే సమ్మోదదాయకమగు దృశ్యము. శబ్దశూన్యమగు పవనములు సమ్మోదశూన్యములు. పక్షులపాటలు, కీటకములవింతధ్వనులు, మానవుల గంభీరభాషణములు, చిన్నిపిల్లల ముద్దుపల్కులతో గూడిన శబ్దపరంపరలతోనిండిన గాలియే సమ్మోదదాయకముగ నుండును.

జీవితకళ నభ్యసించుకొలది, తుట్టతుదకు ప్రేమాస్పదమైన వస్తువులన్నియుగూడ నవసరమని గ్రహింతురు. దారిప్రక్కనున్న యడవిపూవు, జాగ్రత్తతో పెంచిన వరిమొక్క, అడవిలోనిపక్షులు, జంతువులు, ఇండ్లకడ పెంచెడు పశువులుగూడ, సమానావసరములే. ఏలయన, మానవుడు కేవలమన్నముతోనే జీవించలేడు. అడవియందలి నిర్మానుషత్వమువలన

నగమ్యమగు భగవత్ప్రతమైన ప్రతియద్భుతమగు పలుకువలన గూడ నాతడు జీవించవలెను. వాటిని మానవునికి తెలియదు; వానిపూర్వులకును తెలియదు. అందుకే నాతడుధన్యుడు. తన పరివృతమంతయు ననంతము; తనజీవితమే తనకద్భుతము.

మానవజాతి నిజమగునానందమును బడయుటకు సాధించవలసిన పురోగమనము వ్యక్తిగతప్రయత్నముగాని ప్రజానీక ప్రయత్నమున కొనసాగునది కాదు. ఈ పురోగమనమునకు కొన్ని సామాన్యచర్యలు సహాయమిడవచ్చును. కొన్ని చట్టముల సవరణలు దారిజూపవచ్చును. కాని మొదట నిర్ణయింపవలసిన ప్రతిచర్య, చట్టముగూడ ప్రతివాని స్వగృహమునన్నిర్ణయింపవలసినవే. వివేకవంతులగు మనపొరుగువారు, వారికంటె తక్కువస్థితియందుండినవారు, తమ దుస్థితినిగూర్చి మొఱపెట్టునపుడెల్ల "ఈశ్వరుడు తమకుకల్పించిన తమ స్థితితో సంతృప్తి చెందియుండవలె"నని సలహానిత్తురు.

మానవజీవితమున నన్నిస్థితిగతులయందు తృప్తివహించుట సాధ్యముగాదు. మనమట్లు తప్పక తృప్తిచెందవలయునని భగవంతుని యుద్దేశమనలేని కొన్నిస్థితులుండవచ్చును. ఎట్లైనను సర్వదా సంతృప్తివహింపవలెనన్నసూక్తి చాల మంచిదే; కాని యది స్వాంతయుపయోగమునకు బాగుండును. నీపొరుగువాడు వానిస్థితితో తృప్తిచెందవలయుటగాని, చెందకూడకుండుటగాని నీ పనిగాదు; కాని నీస్థితితో నీవు తృప్తిపడవలసియుండుటమాత్రము నీపని.

ప్రస్తుతము మన దేశములో ముఖ్యమైన యగత్యమే మన సక్రమముగ, సద్వినియోగ సామర్థ్యముతో, వినయముతో, యథార్థముగ, శ్రమించుటవలన నెంత యామోదము కల్గునో చూపవలసియున్నది. స్వర్గమువిడిచి వచ్చి ఈ ప్రపంచజీవితమున ఉన్నతమునొందుటకు నిశ్చయించుకొన్న యాదర్శపురుషులు కావలయును. నిరంతర మధిక భాగ్యాన్వేషణమునగాక సామాన్యసంతోషమునే కోరుచు, అధిక ధనసంపత్తిగాక పూర్ణానందమునే గోరుచు, మనోస్థైర్యమునే తొలిసంపత్తిగ గొని, నిరపాయకరమగు గర్వమున ప్రశాంతముగ శాంతిమార్గముల చరించుచు సదా సౌఖ్యముగ నుండుటకు నిశ్చయించుకొన్న యాదర్శప్రాయు లవసరము,

ఈ నమ్రతతోగూడిన శాంతిస్వభావమునుగూర్చి యిట్లు వ్రాయబడెను.

" న్యాయము, శాంతి, ఒకదాని నింకొకటి ముద్దిడుకొనెను ".

మఱియు, "శాంతి చేకూర్చువారి శాంతికై న్యాయ ఫలము నాటబడును".

సామాన్యముగ మనము భావించు శాంతిసంధాయకులుగారు. అనగా సామాన్యముగ కయ్యములలో సమాధానమునుగూర్చువారు కాదు. కాని శాంతిని సృష్టించువారు; శాంతి నిడువారు అని భావము. అట్టి శాంతి తొలుత నీకు లభించినగాని నీ వొసంగజాలవు. ఈ లభించుట సామాన్య

వ్యాపారమున నవశ్యము లభించునట్టిదికాదనిగూడ గ్రహింప వలెను.

వ్యాపారమనగా నన్నిదేశభాషలందుగూడ శాంతి శూన్యమైనది యని యుత్పత్త్యర్థము. మఱియు వివాదకారణ మైనదనిగూడ భావము. ఎట్టిలాభమునుగూడ నంతకంటె తక్కువ శాంతిశూన్యముగ నుండదు. క్రిష్ట్యమాంసమునకై ముందువెనుకల కూగాడు కాకోలమునుబోలు మనసును సూచించును. కాని శాకభక్షులయి పిల్లల కనిపెంచు పక్షులు మాత్రము తమపాదముల దృఢముగ నానజూచును. అట్లే వివేకమునుగూర్చి చెప్పుచు "తనగృహమును తానేకట్టుకొని, ఏడుగృహస్తంభములను తానేచెక్కుకొనె"నని యందురు. ఇక తనగృహమును వీడునపుడు తనగృహప్రాంగణమున చాల సేపు వేచియుండవలసి, బయటికిపోవునపుడును తనమార్గము లన్నియు శాంతిప్రదముగనే యుండును.

మన కన్నివిషయములందును వివేకము గృహప్రవేశ మున నే సహకరించవలెను. నిజమగు నర్థశాస్త్రమంతయు గృహవిధానముననే గలదు. ఆ విధానమును సక్రమము గను, సరళముగను, యుదారముగను గమనింపుము; దేనిని వ్యర్థముచేయకుము, దేనికిని కినుకచెందకుము. ధనమధికముగ గూర్చుటకై నెంతమాత్రముజూడకు; కాని కలిగినదానినుండి యత్యధికముగ చేకూర్చుకొనజూడుము. సకలార్థికవిధానము నందును ముఖ్యసూత్రము, మూలాధారమగు, గొప్పవిశద మగు ననివార్యముఖ్యాంశ మొకటి మాత్రము జ్ఞప్తినుంచు

కొనుము, "ఒకడుకలిగియున్నది, మఱియొకడుకలిగియుండ లేదు" మఱియు నేవిధమైనదైనను, నీవుపయోగించినట్టిగాని, విని యోగించినట్టిగాని ప్రతిపదార్థాణువును యంతవఱకు మానవ ప్రాణమును వెచ్చించినట్లగును. అట్లువెచ్చించుట ప్రాణరక్షణ సాధనమైనను, ప్రాణప్రమోదదాయకమైనను, యుచితముగ వెచ్చించినట్లగును; అట్లుగానిచో నంతప్రాణాటంకముగను ప్రాణనాశనకరమగును.

నీవు కొనునప్పుడెల్ల, మొట్టమొదట నీవుకొను సరకు యొక్క యుత్పత్తిదారుల కేవిధమగు జీవితముకల్పింతువో యోచింపుము. రెండవది, నీవుచెల్లించినధర యుత్పత్తిదారు నికి న్యాయముగ చెల్లవలసిన దగునా కాదాయనియు, నాతనికి చెందవలసిన భాగమాతనికి చేకూరుచున్నదా లేదాయనియు యోచింపవలెను. మూడవది, నీవుకొన్నది స్పష్టముగ నెంత వఱకాహారమునకుగాని విజ్ఞానమునకుగాని, ఆనందమునకుగాని, వినియోగింపగలవో యోచింపవలెను. నాల్గవది, దాని నెవరికి యేవిధముగ నెంతత్వరగ, నెంతయతి యుపయుక్తమగునట్లు అంపకముచేయనగునో యోచింపవలెను. నీ వ్యాపారమం దెప్పుడును సంపూర్ణపరిచ్ఛన్నత, ఖచ్చితనిర్వాహణమును విధించుము. సకలకార్యముల నిర్దోషముగనుండుట, సరళముగ నెరవేర్చుట అభిలషించుము. అందును, వ్యాపారసరకులన్నియు స్వచ్ఛముగ, పరిశుభ్రముగ నుండునట్లు జూడుము. దాని తోబాటు సామాన్యపుఆనందమును జేకూర్చుసాధనముల పొందుటకుగాని, బోధించుటకుగాని సంసిద్ధముగనుండుము.

అట్లనుభవించనగు ఆనందమూ నస్తుపరిమాణముమీదగాక దానిసంతోషమొసగు శాశ్వతమైన రుచియందేయుండును.

ఈవిషయములగూర్చి యథోచితన్యాయము యోచించిన, ప్రతిజాలినెపముననేమి, ప్రతిహక్కును ప్రతిపాదించుచునేమి, యుండు ఈప్రస్తుతమానవజీవిత మొకప్పుడును యనుభోగ్యముగ నుండనట్లగుపడవచ్చును. అట్టిచో, నీవుయోచింపవలసినదేమన, అంధేపాపములేకున్నను, మనచుట్టును ఆ జీవితవిధానమున నెంతబాధకల్గుచున్నదో మనముస్పష్టముగ జూచిన, మనలోనెవరైన అట్టిభోగమునకై యాసింతురా? అట్టి యధికభోగము భావికాలమున జేకూరవచ్చును. అందరి సహాయమున నందరికిచేకూరవచ్చును. కాని ప్రస్తుతమావిధమగుభోగము ఒక్కయజ్ఞానులు మాత్రమే అనుభవింపగలరు. ఎంతటి కఠినాత్ముడునుగూడ తనకండ్లకు గంతలుకట్టుకొన్నగాని ప్రస్తుతము తన విందారగింపనేరడు.

అట్లంధకారముగొల్పు తెఱను ధైర్యముగ తఱలించుము; స్వచ్ఛందవికాసమును జూడుము. అప్పటికిని, ఆవికాసమశ్రుపూరిత నయనంబులనుండియు, పశ్చాత్తప్తశరీరమునుండియే ప్రసరించిన, అల్లవిలపించుచు నమూల్యసంతతిని పెంపొందించుచు నిష్కళంకముగ ముందునకు సాగిపొమ్ము. తుట్టతుదకు క్రీస్తుయొసగు ప్రసాదమును, నీకై చేకూర్చియొసగుట శాంతియు, నీకువలెనే తుదిమానవునికిని చేకూరునట్టి రాజ్యము స్థాపించబడును. అపుడుభూమిపైగల విరోధించుక్రూరజనసమూహములును, నిస్పృహహృదయులును గూడ

సామాన్య గృహమందుకంటె నధికపవిత్రమగు సామరస్యముతోనుందురు. ప్రశాంతమగు నార్ధికవిధానము వర్ధిల్లును. క్రూరులు బాధపడుటకు బదులు బాధపెట్టుటమానుదురు. వేసటపడువారు విశ్రాంతినొందుదురు.

సంపూర్ణము.

